# మాయామయి

## మొదటి అధ్యాయం

### 1

భూతనాథుణ్ణీ, దేవీసింహుణ్ణీ బంధించిన మీదట ఎవరో ఒక వ్యక్తి సాంకేతిక పరిభాషలో ఏదో ఎలుగెత్తి చెప్పాడు. అది విని భూతనాథుని భార్యా, చంపా తమ చేతులలో ఉన్న దీపాలను దూరంగా విసిరి పారేసి వెనుకకు తిరిగారు ఆ చీకట్లో వాళ్ళే దిక్కుగా వెళ్ళిందీ కన్పించలేదు తమను బంధించినవాళ్ళు కూడా ముసుగు మనుష్యులేనని భూతనాథుడూ దేవీసింహుడు గ్రహించారు. ఇద్దరినీ ఆ ముసుగు మనుష్యులు బంగళా వైపు తీసుకుపోయారు. వీరిద్దరూ మారు వేషాలలో ముసుగులు వేసుకున్నప్పటికి ఉజ్జాయింపుగా వారు ఒకరినొకరు గుర్తించుకొన్నారు. సిగ్గుతో తలలు వంచుకొని బంగళాను చేరారు. వసారాలో రెండు దీపాలు వెలుగుతున్నాయి. ముగ్గురు మనుష్యులు కత్తులతో కాపలా కాస్తున్నారు. తమను పట్టుకున్న వారి సంఖ్యలో ఎనమండుగురున్నట్లుగా గుర్తించారు. ఆ మాత్రపు మనుష్యులను ఎదిరించి పారిపోవటం మన ఐంద్రజాలికులకు తేలికే. కాని వచ్చినపని పాడైపోతుందని వాళ్ళా విధంగా చెయ్యలేదు. ఇద్దరూ శృంఖలాబద్ధ హస్తాలతో తమను

బంధించిన వారి వెంట ఆ భవనంలో ప్రవేశించారు. అదిసాధారణ మైన భవనం కాదు, దానిలోని అలంకారాలు అత్యద్భుతంగా ఉన్నాయి. గోళాకారంగా ఉన్న ఆ గదిలో చుట్టూ అనేక విధాల చిత్రపటాలు వ్రేలాడుతున్నాయి. కప్పున రకరకాలైన కాంస్యగోళాలలో క్రొవ్వు వత్తులు వెలుగుతున్నాయి. ఆచిత్ర పటాలలో ఒకటి రోహితగర్భుని యొక్క చిత్రపటం. నేలమీద మృదువైన తివాసీలు పరచి ఉన్నాయి. మన ఐంద్రజాలికుల నిద్దరినీ అక్కడి పరిచారకులు ఎడమవైపు వాకిలిగుండా ఒక యిరుకుమార్గంలో తీసుకువెళ్ళారు. ఆ మార్గాన్ని దాటిన తరువాత వాళ్ళు ఒక విశాలమైన గదిలోకి తీసుకుపోయారు. ఆ గది మరీ అద్భుతంగా ఉన్నది. ఎదురుగా ఉన్న ఆసనాల మీద యిద్దరు ముసుగుమనుష్యులు కూర్చున్నారు. వారికి దిగువభాగంలో ఇంకా చాలామంది ఉన్నారు. వాళ్ళూ ముసుగులతో ఉన్నారు. ఆ ముసుగుమనుష్యులిద్దరిలో ఒకడు "ఎవరు వీళ్ళిద్దరూ?" అన్నాడు.

సమాధానంగా "అయ్యా యితడు దేవీసింహుడు. ఇదిగో ఈయన భూతనాథుడు" అని అక్కడివాడొకడు చెప్పాడు.

ముసుగు :- ఆ వీళ్ళిద్దరూ ఇక్కడి కెందుకువచ్చారు? మీరు బలవంతంగా తీసుకొనివచ్చారా? వాళ్ళేవచ్చారా యిక్కడికి?

"మైదానంలోదాకా వీళ్ళిద్దరూ స్వయంగా నేవచ్చారు. అక్కడనుంచి మాత్రం బంధించి తెచ్చాం."

"వీళ్ళనెందుకు బంధించారోయ్. వీళ్ళు ఇక్కడికి మన కేదైనా అపకారం తలపెట్టివచ్చారా? మిమ్మల్ని ఏమైనా అన్నారా?"

"లేదండీ. దొంగతనంగా చెట్లచాటున నిలబడిఉంటే అనుమానం కలిగిపట్టుకున్నాం."

"మహాబలపరాక్రమవంతుడైన వీరేంద్రసింహ మహారాజుయొక్క జగద్విఖ్యాతిగాంచిన ఇంద్రజాలికుల పట్ల మీరిలా ప్రవర్తించటం న్యాయంకాదు. బహుశః వీళ్ళు మమ్మలను కలుసుకోటానికి వచ్చారేమో? అయినా భూతనాథుణ్ణి ఆవిధంగా చేసినా నాకేమీ చింతలేకుండా ఉండేది.

ఆ చివరిమాట భూతనాథునికి బాధ కలిగించింది. అయినా ఏం చేస్తాడు?."

భూత:- మహాప్రభూ! మేమిక్కడికి దురుద్దేశంతో రాలేదు. నా భార్యను వెదుకుదామని వచ్చాను. ఆమె యిక్కడ ఉన్నాడని నాకు తెలిసింది.

ముసుగు:- ఏమో నేనెట్లా నమ్మేది? బహుశః మీరూ రాజసభలోనికి హాజరవుతున్న ముసుగు మనుషుల జాడ తెలుసుకోవటానికే వచ్చారేమో? కాని యీ ఇల్లు వాళ్ళది కాదు. మాది. వాళ్ళింట్లోకి వెళ్ళే ద్రోవను మీరు సొరంగంలోనే దాటి వచ్చేశారు సరే వచ్చినవాళ్ళు ఎట్లాగూ వచ్చారు. మిమ్మలని కష్టపెట్ట దలచుకోలేదు. ఈ రాత్రి యిక్కడ ఉండి ప్రొద్దున్న వెళ్ళిపోండి! ఒరేయ్! చూడండీ వీళ్ళకు భోజనవసతులవీ జాగ్రత్తగా ఏర్పాటుచెయ్యండి. ప్రొద్దుననే లేవగానే గుహ బైటికిపంపించి వెయ్యండి.

ముసుగుమనుష్యులు అక్కడనుంచి వెనకనే ఉన్న కొండలలోనికి వెళ్ళిపోయారు. మిగిలిన మనుష్యులలో ఒకడు "నాతోపాటు పైకిరండి" అని భూతనాధ దేవీసింహులను తీసుకు పోయాడు. అక్కడ ఒక చక్కని గదిలో వాళ్ళని విడిచిపెట్టాడు. మీరేమి భోజనం చెయ్యండంటే వారు ఆకలికావటంలేదన్నారు వాళ్ళిద్దరినీ ఆగదిలో పెట్టి బైట గొళ్ళెంవేసి ఎక్కడివాళ్ళక్కడికి వెళ్ళిపోయారు.

## 2

ఆగదిలో భూతనాధ దేవీసింహులకు ఈవిధంగా సంభాషణ జరిగింది.

దేవీ:- నీకు తెలియకుండా నేనూ నాకు తెలియకుండా నీవూ మనమిద్దరం ఇక్కడికివచ్చినా ఏమీ లాభంలేకుండా పోయింది. నీవేదో యిక్కడ పనిఉండి వచ్చావనుకో! నేను ఏదో చూద్దామనివస్తే చిక్కులలో పడ్డాను.

భూత:- వస్తేమాత్రమేం? మీకేమీ ఒకటి జరిగిందిగా? ఇక్కడ మీ గృహలక్ష్మి కన్పించింది గనుక మీరూ ఊరకుండరు.

దేవీ:- అదిసరేకాని, భూతనాధా! నీవెంత గట్టివాడవయ్యా! ఇటువంటి అవస్థలలోకూడా ఏమాత్రం చలించనే చలించవే!

భూత:- ఏం? నీవైతే భయపడిపోతావా?

దేవీ:- లేకపోతే నాకు నీవలేవుండటం సాధ్యమా? అందుచేతనే నీవింత మహావ్యక్తివిగా రాణించగలిగావు.

భూత:- కాని, నేనిప్పుడు జీవచ్ఛవంలాగా వున్నాను.

దేవి:- ఎందుచేత?

భూత:- జీవితంలో అపవాదంటూ ఏర్పడినతర్వాత ఆ వ్యక్తి బ్రతికిఉన్నా మరణించినట్లే. వీరేంద్రసింహ మహారాజుకు నమ్మినబంటుగా జీవించలేనంతవరకు నేను బ్రతికిఉన్నా మరణించినవారిక్రిందనే లెక్క. మీతో నేనీవిధంగా మాట్లాడటానికి కారణం మీరు నా శ్రేయోభిలాషులని తలంచటం చేతనే బహుశః మీకు నకిలీ బలభద్రసింహుడు తొలుదొల్త కలుసుకొన్ననాటి ఉదంతం జ్ఞప్తిలో ఉండిఉండవచ్చు. మీరప్పుడు నాపై అత్యంతమైన అనురాగాన్ని చూపిస్తూ ఎటువంటి పరిస్థితులలోకూడా మీ స్నేహితునిగా నన్ను పరిగణిస్తారని శపథంచేసి వున్నారు.

దేవి:- అవును. గుర్తున్నది. నీవప్పుడు భయకంపితుడవై ఉన్నావు. అప్పుడు నేను నీవెన్నిదోషాలుచేసినా చివరకు నా తండ్రివంటివాడిని సయితం హత్యచేసిన విరోధివైనా నీపై నాకు గల స్నేహం తొలగిపోదని వాగ్దానంచేశాను. అదేకదూ?

భూత:- అవును!

దేవి:- ఇప్పుడుకూడా నేనదే విధంగా పునరుద్ఘాటిస్తున్నాను.

భూత:- మీ ఋజువర్తనాన్ని గురించి నాకేవిధమైన సందేహంలేదు.

దేవి:- ఈమాటలు నీవు నిజంగానే అంటున్నావా?

భూత:- మీకెందుకు అనుమానం?

దేవిః— నీ వింతవరకూ నాకు నీ రహస్యాల నేవీ చెప్ప లేదు. చివరకు ఇవ్వేళ ఇక్కడికి వస్తున్నట్లుకూడా చెప్పలేదు.

భూతః— అవును ! తప్పేచేశాను. క్షమించండి.

దేవిః— సరే పోనీ ! ఇప్పటికీ నీవు నన్ను స్నేహపాత్రుణ్ణి గానే భావిస్తుంటే నాకు చాలా సంతోషం. నీ విక్కడికి తప్ప కుండా వస్తావనే నేనూ వచ్చాను. ఇక యిప్పుడు మనమేం చేద్దామో చెప్పు ! నీదగ్గర మెరపుకత్తి వున్నదికదూ ?"

భూతః— ఇదిగో సిద్ధంగానే వున్నది.

దేవిః— అయితే నాదగ్గరకూడా ఒకటి వున్నది.

భూతః— మీకెక్కడిది?

దేవిః— తేజసింహుడిచ్చాడు. ఈ కత్తి మనోరమదగ్గర వుండేది. ఈ కత్తికి సంబంధించిన వుంగరాన్ని ఆమె నడు ములో కుట్టివేసుకున్నది. ఆ రహస్యం చాలా కష్టంమీద తెలుసుకోగలిగాం. ఆ పద్ధతి నాకూ బాగానే నచ్చింది.

భూతః— అయితే యిప్పుడేంచేద్దామని మీ ఉద్దేశం? పారిపోవటమా? లేక యిక్కడనే వుండి రహస్యాలు తెలుసు కోవటమా ?

దేవిః— మనం తలచుకుంటే పారిపోవటం ఒక లెక్క లోనిదికాదు. నిర్బంధంపాలైనవాళ్ళం ఎలాగూ నిర్బంధంలో వద్దాము. కనుక యిక్కడి రహస్యాలు తెలుసుకొని వెళ్ళటమే మంచిది. మనమిద్దరం మన అర్ధాంగులు యిక్కడనే వుండటం చూచాం. వాళ్ళ వ్యవహారమేమిటో తెలుసుకోకుండా వెళ్ళితే యెట్లా ?

ఆ సమయంలో ఎవ్వరో బిగ్గరగా నవ్వటం వినిపించింది. భూతనాథునికి ఆ నవ్వు పరిచితమయినదిగా తోచింది. దేవీసింహుడు అలాగే అనుమానపడ్డాడు. ఆ ధ్వని ఎటునుంచి వచ్చిందో పరిశీలించసాగారు. వాళ్ళకు ఆ గోడకు చాలా ఎత్తున రెండు దిడ్డిగంటలు కన్పించాయి. అవి గాలికోసం ఏర్పాటు చేయుబడినవి అక్కడినుండే ఆ నవ్వు వస్తున్నట్లు స్పష్టమయింది. మన ఐంద్రజాలికులు ఆకంతలోనుంచి చూడాలనికూడా అనుకొన్నారు. తమకోసం ఆగదిలో వేసిన మంచాలను నిలువుగా ఒకదానిమీద ఒకటి గోడకానించారు. గదిలో వెలుగుతున్న దీపం ఆర్పివేశారు. ఆ దిడ్డిగంతలోనుంచీ వెలుతురు వస్తోంది. దేవీసింహుడు పైకెక్కాడు. ఆ కంతలు మలువు తిరిగి వున్నాయి. ఒకదానిలో తలపెట్టి దేవీసింహుడు అవతలికి చూడసాగాడు. క్రింది అంతస్తులోని ఒక గది భూతనాథుడు దేవీసింహుడు వున్నగది అంత ఎత్తుగాను వున్నది. దానిలో రెండు దీపాలు వెలుగుతున్నాయి. ఎత్తయిన సింహాసనాల మీద యిద్దరు ముసుగు మనుష్యులు వారి ప్రక్కల నలుగురు ముసుగుమనుష్యులు కన్పించారు. వాళ్ళకెదురుగా దేవీసింహుడు తన భార్యా, భూతనాథుని భార్యా, నిలబడివుండటం కూడా కన్పించింది. వాళ్లు ఏదైనా బిగ్గరగా మాట్లాడితేమాత్రం విన్పిస్తోంది. మనం సారంగపు మార్గాన్ని మూయకుండా వుండటంవల్లనే దేవీసింహుడూ, భూతనాథుడూ యిక్కడకు రాగలిగారు ఇకమనం ఎప్పుడూ అట్లా చెయ్యగూడదు. అని వినిపించింది. అంతలో మరొక ముసుగుమానిసి వచ్చాడు. అతడు తన ముఖానగల ముసుగు తొలగించివేశాడు. దేవీ

సింహుడతన్ని గుర్తించాడు. అతడు భూతనాథునియొక్క కొడుకూ కమలయొక్క సహోదరుడూ అయిన హారనామ సింహుడు. హారనామసింహుణ్ణి దేవీసింహుడు ఇంతవరకు ఒకటి రెండుసార్లు చూచాడు. అతడు ఆశ్చర్యంతో క్రిందకుదిగి భూత నాథుణ్ణి పైకెక్కించాడు. భూతనాథుడు తన కుమారుణ్ణి గుర్తించి ఆశ్చర్యచకితుడై వాళ్ళ సంభాషణలు వినసాగాడు.

బహుశః ఈ పుస్తకం రెండో భాగంలో హారనామ సింహుని పేరు వచ్చివుంటుంది. ఆతర్వాత ఇతనిపేరెక్కడా రాలేదు. ఇతడు మాయారాణికి ఐంద్రజాలికుడుగా వున్న హారనామసింహుడు కాడు. ఇతడు కమలయొక్క అన్నగారూ, భూతనాథునియొక్క జ్యేష్ఠపుత్రుడూ అయిన హారనామ సింహుడు.

హారనామసింహుడు సింహాసనాలమీద కూర్చున్న ముసుగుమనుష్యులకు ఎదురుగా నిలబడి ప్రధాన ద్వారంవైపు పరీక్షగా చూడటం భూతనాథునికి కన్పించింది. ఆసమయంలో ఒక వ్యక్తి ఒక దుప్పటిలో కట్టిన పెద్ద మూట నొకదాన్ని తీసుకొని ఆ మూటను ముసుగుమనుష్యుల కెదురుగా పెట్టి గాద్గదికస్వరంతో "ప్రభూ! భూతనాథునిపై నేను దీనిని గురించే ఫిర్యాదు చేయదలచుకొన్నాను" అన్నాడు.

ప్రక్క నేఉన్న ముసుగుమనుష్యులు ఆ మూటను విప్పారు. అది ఒక మనుష్యుని ఎత్తుగల చిత్రపటం. దానిని భూతనాథుడు పరీక్షగాచూచి ఎందుచేతనో కంపించిపోసాగాడు. అతడు తనను తాను సంబాళించుకోలేక గట్టిగా అరిచాడు. ప్రక్కగదిలోని వారందరూ తలలెత్తి చూచారు.

భూతనాథుడు క్రిందికి దిగివచ్చి దేవీసింహునితో "అయ్యా! నేను గట్టిగా అరిచాను. వాళ్ళు విన్నారు. ఎవరైనా ఇక్కడికి వస్తారేమో? మీరేదైనా చెయ్యగలిగితే చెయ్యండి" అన్నాడు.

దేవీసింహుడు క్రొవ్వొత్తి వెలిగించాడు. లోగడ ఆర్పివేసిన దీపాలను వెలిగించాడు. మంచాలను మామూలుగా అమర్చిఉంచాడు. భూతనాథుణ్ణి ఒకదానిమీద శయనించమనీ కడుపులో నొప్పివచ్చినందువల్ల బాధపడుతున్నట్లు నటించమనీ చెప్పాడు. అప్పుడే నలుగురు ముసుగుమనుష్యులు ఆ గదిలోనికి వచ్చారు.

ఒకడు :- మీరింకా మేలుకొనే ఉన్నారా?

దేవీ :- అవునండీ ఈయనకు కడుపులో నొప్పివచ్చింది. ఒకటే బాధపడుతున్నాడు.

ముసుగు :- ఏమీ తినలేదుకూడాను. మందేమైనా తెప్పించమంటారా?

దేవీ :- ఇప్పుడే నేను మందిచ్చాను. కొద్దిగా తగ్గుముఖం పట్టిందిలెండి.

ముసుగుమనుష్యులు వెళ్ళిపోయారు.

దేవీ :- ఎందుకయ్యా అట్లా అరిచావు?

భూత :- ఏం చెప్పను? ఆ గదిలో నా కొడుకును చూచాను. అతడు మారువేషంలో ఉన్న ఇంద్రజాలికుడు కాడు. నిజంగా నా కొడుకే. అందుకు నాకేమీ కష్టమనిపించలేదుగాని ఆ తరువాత ఒకడు పెద్ద చిత్రపటం తెచ్చి

"దీనినిగురించే నేను భూతనాథునిపై ఫిర్యాదు చేయదలచు కొన్నాను." అన్నాడు.

దేవీ :– అదెవరి చిత్రం.

భూత:– ఏమని చెప్పను? నేను ఆ యిత్తడి పెట్టెను చూచి యెంత భయపడుతున్నానో నీకు తెలుసుకదా ?

దేవీ:– ఆఁ. తెలుసు.

భూత:– బలభద్రసింహుడు రాజసభలోనికి వచ్చిన ముసుగుమనుష్యులు నాకు సహాయపడతారని చెప్పాడు. వాళ్ళు ఏవిధంగానైనా ఆపెట్టెను మహారాజుచేత నాకు ఇప్పిస్తారనికూడా చెప్పాడు. నేనలాగే అనుకొన్నాను. కాని ఇప్పుడు నేను చూచిన చిత్రపటం నా కేవిధమైన ఆశలూ లేకుండా చేస్తోంది.

దేవీ:– ఆ పెట్టెకూ ఈ చిత్రపటానికి ఏమి సంబంధం?

భూత:– ఆ పెట్టెలోని రహస్యాన్ని యీ చిత్రపటం బహిరంగ పరుస్తోంది! అంతేగాక యింతవరకూ నేను ఎవరూ నాపైన అభియోగం చేసేవాడు లేడనుకొన్నాను. ఇప్పుడటు వంటివాడూ వకడు సిద్ధమయ్యాడు.

దేవీ:– ఆ పెట్టెలోనూ ఈ చిత్రపటంలోనూ దాగిన రహస్యాలేమిటి ?

భూత:– మీకు తెలియజేయటంవల్ల మీకే కష్టం.

దేవీ:– కష్టమైతేమాత్రం ఏం చేస్తాను ? ఇంతకూ దానికీ మహారాజుకూ సంబంధమున్నదా ?

భూత:– ఆ రహస్యం తెలియటంవల్ల మహారాజులు

నన్నూ అసహ్యించుకోంటూరు. ఎంతకుమించీ ఆయనకు నష్టం కలిగే దేమీలేదు.

దేవీ:- అలాగైతే పరవాలేదు. ఆ రహస్యమేమిటో చెప్పు.

భూత:- ఇక్కడ నేను చెప్పటం మొదలు పెట్టితే ఎవరైనా వింటారు. మనం బయటికి వెళ్ళిన తర్వాత చెబుతాను.

దేవీ:- అలాగే కానీ. అయితే ఆపటాన్ని తెచ్చినవాణ్ణి గుర్తించావా?

భూత:- గుర్తించాను. అతడే నా ప్రధాన శత్రువు.

దేవీ:- అతడు నీ చేజిక్కితే యేం చేస్తావు?

భూత:- వాణ్ణి ఉరివేసి చంపుతాను. ఇన్నాళ్ళనుంచీ వాడు చచ్చాడనుకొన్నాను. కానీ బ్రతికే ఉన్నాడు.

దేవీ:- వుంటే వున్నాడులే. ఎందుకలా కంగారుపడతావు? నీకు నేనా పెట్టె నిప్పిస్తాను. నీవేం భయపడబోకు.

భూత:- చాలా కృతజ్ఞుణ్ణి.

అప్పటికే తెల్లవారింది. భూతనాథుణ్ణీ దేవీసింహుణ్ణీ బయటికి నడవండని ఒక ముసుగు మనిషి వచ్చి చెప్పాడు.

## 3

దేవీసింహుడూ, భూతనాథుడూ మరునాడు రాకపోయేసరికి సభ వాయిదాపడ్డది. ఐతే ముసుగు మనుష్యులు మాత్రం యథాపూర్వంగావచ్చారు. ఆ సమయంలో వీరేంద్రసింహుడు తేజసింహుడు మొదలైన ఇంద్రజాలికులతో

కూర్చుండి భూతనాథ దేవీసింహులను గూర్చి ఆలోచిస్తు న్నాడు. ముసుగు మనుష్యులను తమవద్దకు రానిచ్చారు.

వీరేం:- ఇవ్వేళ భూతనాథుడు లేకపోవటంవల్ల విచారణ వాయిదావడ్డది.

ముసుగు:- అవునట! దేవీసింహుడూ, భూతనాథుడూ కన్పించటంలేదని మేము ఇక్కడికి వచ్చిన తర్వాత తెలిసింది. వాళ్ళిద్దరూ కలిసి ఎక్కడకు వెళ్ళిఉంటారబ్బా? భూతనాథుడు మాత్రం మా జాడతియటానికి బయలుదేరి ఉంటాడని మాకు తెలుసు. దేవీసింహుడూ ఎవరికీచెప్పకుండా ఎందుకు వెళ్ళాడో?

వీరేం:- మమ్మల్ని అడిగే వెళ్ళాడు.

ముసుగు:- మమ్మల్ని వెంటాడమని మీరెందుకాజ్ఞాపించారు? మేమెవరమో త్వరలోనే మీకు చెబుతాం.

తేజ:- భూతనాథుడు దేవీసింహుణ్ణి తన మిత్రునిగా చేసుకొన్న సంగతి మీకు తెలియదనుకొంటాను.

ముసుగు:- అయితేకావచ్చు భూతనాథుడు చాలా మంచివాడుకూడా.

తేజ:- మిమ్మల్ని ఒక విషయం అడగాలనుకొంటున్నాను.

ముసుగు:- అడగండి!

తేజ:- నిజానికి దేవీసింహుడూ, భూతనాథుడూ మీ రహస్యాలు తెలుసుకోటానికే వెళ్ళారు. వాళ్ళు మీరున్న చోటును చేరుకొనే వుంటారుగనుక మీరు వాళ్ళను చూచే ఉంటారు.

ముసుగు:- లేదే!

తేజ:- అయితే వాళ్ళిద్దరూ ఎందుకు రాలేదు ?

ముసుగు:- ఏమో ? ఇవాళ మేము వచ్చినందుకు రాకుమారుల విశేషాలను మహారాజుకు విన్పిస్తాం. గోపాలసింహ మహారాజు అక్కడ ఉన్నంతవరకూ మీ కుమారులసంగతులు మీరు తెలుసుకొనే వుంటారు.. ఆతర్వాత జరిగిన విశేషాలు మీకు తెలియచేసుకొంటాను. అంగీకరిస్తే ఆ సంగతులన్నీ నేను చెబుతాను.

వీరేం:- ఎప్పటివరకూ మీరు చెప్పగలరు?

ముసుగు:- ఈరోజు దాకా జరిగినవి చెప్పగలను.

వీరే:- అయితే చెప్పండి! మాకూ వినాలనివున్నది. కాని యిక్కడ గోపాలసింహుడూ మా నాన్నగారూకూడా వుంటే బాగుంటుంది. ఇంతకూ మీకా సంగతులు ఎట్లా తెలుసూ?

ముసుగు:- ప్రభువులవారు ఆ సంగతి అడగకూడదు.

వీరేం:- సరే మీయిష్టం.

తేజసింహుడు సురేంద్రసింహ మహారాజువద్దకు వెళ్ళి తిరిగివచ్చాడు. గోపాలసింహుని కొరకుకూడా ఒక ఐంద్రజాలికుణ్ణి పంపాడు.

# 4

సురేంద్రసింహ మహారాజుగారి యెదుట ముసుగు మనుష్యులు రాకుమారులయొక్క విశేషాలను తెలియజేయుటం ప్రారంభించారు.

"గోపాలసింహునివద్ద శెలవు తీసుకొని రాకుమారులు బావిదగ్గరకు వెళ్ళారు. అప్పటికి తెల్లవారింది. రాకుమారులు స్నానానికి బావిలో దిగారు. ఆనందసింహుడు ఈదుకుంటూ మధ్యకు వెళ్ళాడు. అక్కడ నీళ్ళలో ఒక అరుగులాటిది కన్పించింది. దానిమీద ఒక యినుపకొండి ఉన్నది. ఆనందుడు దానిని లాగి పైటికి వచ్చాడు. ఇద్దరూ స్నానం పూర్తిఅయిన తరువాత [illegible] కూర్చున్నారు.

ఇనుపకొండిని లాగివచ్చినప్పటినుంచీ బావిలో నీరు తగ్గిపోసాగింది. రెండుగంటలలో పూర్తిగా నీళ్ళన్నీ పోయాయి. ఆ బావిచుట్టూ ఉన్న చివరిమెట్టు దాదాపు రెండుగజాల ఎత్తున ఉన్నది. దానికి నలువైపులా నాలుగు వాకిళ్ళున్నట్లు కన్పించాయి. తూర్పువైపునున్న వాకిలిని రాకుమారులు తెరిచారు. ఒక సొరంగం వంటిది కన్పించింది. ఆనాటి సాయంకాలం రాకుమారులు ఆ సొరంగపు మార్గంగుండా ప్రయాణం సాగించారు. వాళ్ళిద్దరూ ఆ ఐంద్రజాల వనంయొక్క నాలుగవ భాగంలోగల దేవమందిరం సమీపంలోని గోళాకారంగా ఉన్న గృహంలోనికి చేరుకొన్నారు. (ఆ గృహం నల్లరాళ్లతో కట్టినదనీ దానికి నలువైపులా పలురకాలైన యంత్రాలూ మీటలూ వున్నాయనీ లోగడే చెప్పాము.)

ఆ యింటికి నలువైపులా చుట్టూ ఉన్న పసారాలే గాక ఎన్నో గదులుకూడా ఉన్నాయి. మధ్యగా ఒక పాల రాతి వేదిక వున్నది. ఆ వేదికమీద లోహనిర్మితమైన ఒక మానవ విగ్రహం కూర్చున్నట్లు ఉన్నది. ఆ లోహనిర్మిత మానవమూర్తికి ఎదురుగాగల సొరంగంలోనుండే రాకుమా

రులు బైటికి వచ్చారు. ఆ సొరంగానికి ప్రక్కగానే మరొక
సొరంగముంది. దానిలోనికి దిగటానికి మెట్లున్నాయి. రాకుమా
రులు ఆ రెండవ సొరంగంలోనికి పదెనిమిది మెట్లు దిగారు.
అక్కడ నిలబడి చూస్తే ఆ సొరంగం చాలా పొడుగుగా
కన్పించింది. దానిని దాటి సోదరులిద్దరూ ఒక తోటలో ప్రవే
శించారు. ఆ తోటలో అడవి తీగలూ, ఇంకా రకరకాల
చెట్లూ ఉన్నాయి. అక్కడ చాలా మంది అటూ ఇటూ
తిరుగుతున్నారు. వాళ్ళు అడవి మనుష్యుల్లాగా కన్పిస్తున్నారు.

అక్కడ తిరుగుతున్న ఆ అడవి మనుష్యులు రాకుమా
రుల వంక ఆశ్చర్యంగా చూడసాగారు. అందులో ఒకడు
రాకుమారులను సమీపించి "మీకెవరూ సంగతే పట్టించరా? మరి
ఆయుధాలూ బట్టలూ లాగుకోకుండా వున్నారేంటి?" అన్నాడు.

ఇంద్ర:- మిమ్మల్ని ఎవరు ఏం చేశారు? అసలు మీ
రెవరు?

అతడు:- మేమెవరమో చెప్పటం అంత తేలిక కాదు.
మీరేమి నేరం చేసి యిక్కడకు వచ్చారో చెప్పండి.

ఇంద్ర:- మేమిద్దరం అన్నదమ్ములం. ఈ యింద్ర
జాలాన్ని ఛేదిస్తూ ఇందులోని ఖైదీలను వదిలిపెడుతూ ఇక్క
డికి వచ్చాము. మీరుకూడా ఖైదీలా. అయితే మీరు త్వర
లోనె విడుదలౌతారు.

అతడు:- మీరు చెప్పేది నిజమని మేమెలా నమ్మం.

ఇంద్ర:- కొద్దిగా ఆగితే మీకే మా సంగతి తెలుస్తుంది.

రాకుమారు లిద్దరికీ సరయూనదిలోని యీ మనుష్యులు
కూడా ఇక్కడ ఖైదీలుగా బంధీలయి వున్నారని తెలిసింది.

వాళ్ళేమంత పెద్దవయస్సులో లేరు. కాని దీర్ఘకాల కారా
గారవాసంవల్ల చిక్కి శల్యావశిష్టులై వున్నారు. కేశ సంస్కా
రాదులు లేక చిక్కుపడిన వెంట్రుకలతో చూడటానికి అడవి
మనుష్యులలాగా కన్పిస్తున్నారు.

ఆ తోటలో ఒక కాలువ ప్రవహిస్తోంది. ఆ కాలువే
ఖైదీలకు జీవనాధారం. అయితే ఆ కాలువ ఎటువైపునుంచి
వచ్చి ఎటు వెళ్ళుతుందో తెలియటంలేదు. ఆ నీటివల్ల ఖైదీలు
అరటి మొదలైన పండ్లచెట్లు పెంచుకొని ఆ పండ్లవల్ల ప్రాణాలు
నిలుపుకొంటున్నారు.

ఆ తోటకు మధ్యలో ఒక ఎత్తయిన బురుజున్నది. ఆ
బురుజుకు చుట్టూ నల్ల రాళ్ళతో నడుము ఎత్తున ఒక వేదిక
వుంది. కాని ఆ బురుజుపైకెక్కటానికి మార్గం కన్పించటంలేదు.
రాకుమారులు తిన్నగా వెళ్ళి ఆ అరుగుమీద కూర్చున్నారు.

ఇంద్రుడు:- ఏమయ్యా మామీద ఇప్పటికైనా మీకు
నమ్మకం కలిగిందా?

అతడు:- అవునండీ! లోగడ మేము ఈ అరుగుమీద
కూర్చోటానికి చాలా ప్రయత్నంచేశాము. దానిని ముట్టు
కొంటేనే మేము స్పృహకోల్పోయేవాళ్ళం. నిరపాయకరంగా
మీరివ్వాడు ఈ అరుగుమీద కూర్చోగలగటంవల్ల మీపై
నాకు నమ్మకం కలిగింది.

ఇంద్రుడు:- మేము కూర్చున్నంతసేపూ మీరూ కూర్చో
వచ్చు.

"నిజంగానా?"

"అవును పరీక్షించిచూడు."

అతడు అరుగును తాకిచూచాడు ప్రమాదమేమీ జరుగలేదు. అతణ్ణిచూచి మిగతా వాళ్ళుకూడా అరుగుమీద కూర్చున్నారు. రాకుమారులను "దయచేసి తమరెవరో చెప్పండి" అని ప్రార్థించారు. ఇంద్రజిత్సింహుడు తన వృత్తాంతం తెలియజేసిన మీదట ఖైదీలు తటాలున ఆ అన్నదమ్ముల కాళ్ళపైబడి కన్నీరుమున్నీరుగా విలపించారు అని చెప్పి ముసుగుమనుష్యులు మౌనం దాల్చారు.

వీరేం:-బహుశః ఆ వేళలో విద్యుత్ప్రభావం ఉన్నది కాబోలు! మా వాళ్ళదగ్గర మొజుపు[illegible]త్తి ఉండటంవల్ల ఏమీ అపకారం తటస్థించి ఉండదు.

ముసుగు:- అవునండీ అవును.

వీరేం:- అప్పుడేం జరిగింది?

ముసుగు:- రాకుమారులు అప్పుడు వాళ్ళ సంగతులు అడిగారు. వాళ్ళు ఏడుస్తూ తమ గోడు చెప్పుకొన్నారు.

వీరేం:- ఇంతకీ ఎవరట వాళ్ళు?

ముసుగు:- అదేనండీ చెబుదామా వద్దా అని ఆలోచిస్తున్నాను.

తేజ:- ఏం? చెప్పగూడదా? చివరకుమాత్రం మాకు తెలియదా ఏమిటి?

ముసుగు:- ఎందుకు తెలియదూ. నేనే రెండుమూడు రోజులాగితే చెప్పనూ.

జీత: అలాగే రెండురోజులాగినతర్వాత చెప్పండి.

ముసుగు:— చిత్తం ఇకమేం వెడతాం. రేపు మళ్ళీ రాజసభకు హాజరౌతాము. పిదప ఆ ముసుగు మానిసులు అక్కడినుండి వెళ్ళిపోయారు.

## 5

దేవసింహునికీ భూతనాథునికీ తమ భార్యలసంగతి తెలుసుకోకుండే అక్కడనుంచీ వెళ్ళటం ఇష్టంలేదు. కాని ముసుగుమనుష్యులకు విరుద్ధంగా నడవటం వారికిష్టం కాదు. తమను తీసుకొనివచ్చిన ముసుగుమానిసి వెంటనే వెళ్ళుతున్నారు. మైదానంలో ప్రవేశించినమీదట భూతనాథుడు ముసుగుమానిసితో "ఏమయ్యోయ్, మీయజమానిని నొక సారి కలుసుకోవాలి" అన్నారు.

ముసుగు :— ఇప్పుడు వీలుకాదు.

భూత:— పోనీ! వక గంట ఆగవలసి వచ్చినా ఆగుతాం.

ముసుగు:— అలా వీలుకాదు. రాత్రి ఆయన మాకు చెప్పినట్లు చెయ్యవలసిందే?

భూత:— అత్యవసర విషయముందయ్యా.

ముసుగు:— ఉత్తరంవ్రాసి యిచ్చివెళ్ళు! దానికి సమాధానం తిన్నగా నీయింటికేవస్తుంది.

భూత:— ఇదిగో చూడూ! మమ్మల్ని బంధించటానికి పూర్వం మాకు కనిపించిన ఆడవాళ్ళున్నారు చూచావూ వాళ్ళనొక్కసారి కలుసుకోవచ్చునా ?

ముసుగు:— వీలులేదు. ఆస్త్రీలను మీ వాళ్ళనే అనుకొంటున్నావా?

భూత:- ఇక్కడినుంచీ మేము వెళ్ళం. ఏంచేస్తావు?

ముసుగు:- బలవంతంగా అవతలికి గెంటివేస్తాము. మంత్రశక్తులున్నాయనుకొంటున్నారేమో అవేమీ యిక్కడ పనిచేయవు.

ముసుగుమనుష్యులు వాళ్ళను గుహావెలుపలకు తీసుకుపోయారు. అక్కడ "ఇక వెళ్ళండి. నిన్న తెరచిఉంచామని యిక ఎప్పుడూ ఈ గుహ తెరచే ఉంటుందని అనుకోకండి!" అని ముసుగుమనుష్యులు వెళ్ళిపోయారు.

దేవిసింహుడూ భూతనాథుడూ ఒక అడవిలో చెట్టు క్రింద కూర్చున్నారు.

భూత:- ఏంచేద్దామంటావు?

దేవి:- ముసుగుమనుష్యుల యింటికి వెళ్ళి ఎంత అవమానపడాం! మనకు కనిపించినవాళ్ళే మన దర్బారుకు వచ్చేవాళ్ళు. వాళ్ళు ఇక దర్బారులోనికివస్తే నాకు ముఖంచూపించబుద్ధికాదు. ఈ అప్పటికేమించి దగ్గరకు వెళ్ళినతరువాత నా పెండ్లాం కనపడకపోతే నేను సహించలేను.

భూత:- నాకూ చాల అవమానంగా ఉన్నదయ్యా! ఇంత మాయాజాలం తెలిసికూడా లాభంలేకుండా పోయింది. ఒక్కణ్ణయినా పట్టుకోలేదే నాకిక్కడినుంచీ రావటానికి బుద్ధి పుట్టటంలేదు. ఇక నీయింట్లో నీ భార్య ఉంటే నాయింట్లో నా భార్య వున్నదనే అనుకొంటా.

దేవి:- మనం వాళ్ళను ఏంచేసినా దర్బారుకు రాకుండా ఆగిపోతారు. అప్పుడు మన ఖైదీలవిచారణకు అంతరాయం

కలుగుతుంది. కనుక నావలెనే నీవూ అవమానాన్ని సహించ టానికి కొంచెం ఓపికపట్టు.

ఆసమయంలో గుఱ్ఱంమీాద ఒకముసుగుమనిషి రావటం కన్పించింది.

భూత:- మనం ఏదో ఒక ఉపాయంవల్ల యీముసుగు మనిషిని పట్టివేద్దాం.

ఇద్దరూ మార్గానికి ఇరువైపులా చెట్లచాటున దాగారు. గుఱ్ఱం తమమధ్యకువచ్చినప్పుడు భూతనాథుడు త్రాడునుగుఱ్ఱం మెడలోకి విసిరాడు. గుఱ్ఱం ఆగిపోయింది. ఇద్దరూవచ్చి కళ్ళెం పట్టుకొన్నారు.

ముసుగు:- ఎందుకయ్యా నన్ననవసరంగా ఆపుతారు? మీాకేంకావాలి?

భూత:- కొద్దిగా గుఱ్ఱాన్నిదిగి మేమడిగిన ప్రశ్నలకు సమాధానంచెప్పు.

ముసుగు:- "అలాగే చెబుతాగానీ ముసుగుమాత్రం తియ్యను" అని దిగాడు.

భూతనాథుడు "అలాకుదరదు. ముసుగుతీయవలసిందే" అనితనచేతితో ముసుగునులాగాడు. ఆ ఆకారాన్ని చూచి "అరె! ఈమె నా పెండ్లాం. ఇప్పుడే ముసుగుమనుష్యుల యింట్లో కనిపించిందే!" అన్నాడు.

# 6

భూతనాథుడు తన భార్యను చూచి ఎంత అశ్చర్య పడ్డాడో దేవీసింహుడుకూడా అంతే ఆశ్చర్యపడ్డాడు. దేవీ సింహునికి తన భార్యయొక్క ప్రవర్తన తలంచుకొన్న కొద్దీ ఆమెపై దుర్భర క్రోధావేశం కలగసాగింది. భూతనాథుని నోటినుండి "అరె ! ఈమె నా భార్య!" అన్న మాటలు విన్న ఆ స్త్రీ క్రోధారుణిత నేత్రాలతో "ఏమిటోయ్? బలవంతంగా నా ముసుగును తొలగించటమేగాక నోటికొచ్చినట్టు నన్ను నీ పెండ్లాం అనికూడా అంటున్నావే. (దేవీసింహునితో) ఏమండీ మీరు విశ్రుతచరిత్రులైన ఐంద్రజాలికులుగదా? ఇతడీ విధంగా నన్ను భార్య యని సంబోధించుట న్యాయమేనా ?"

దేవీ:- నీవు నిజంగా భూతనాథుని యిల్లాలివి కాకపోతే అతడావిధంగా అనటం చాలా పొరపాటు.

ఆమె:- (భూతనాథునితో) ఏమయ్యా ! నన్ను నీవిలా అగౌరవపరుస్తావా ? మావాళ్ళెవరైనా ఇక్కడ ఉంటే ఏమనుకుంటారు ?

భూత:- అయితే నేను కలగంటున్నానా ?

ఆమె:- ఆ సంగతి నీకే తెలుసు. మొత్తంమీద మీరు మీ అపవిత్ర జీవితానికి సరిపోయిన విధంగానే ప్రవర్తించారు. నాలో ఏ లక్షణాలు చూచి మీరు నన్ను ఆ విధంగా సంబోధించారు ?

భూత:- ఒకవేళ నీవు నా భార్యను చూడకపోయినా ఆమె మోస్తరుగానే ఎవరో మీకు మారు వేషం వేసి వుండవచ్చు.

ఆమె:- మీకేం? ఏదో ఒకవిధంగా మనస్సులోని మీరు సంతృప్తిపరచుకుంటారు. కాని నాపట్ల మీరేదైనా అన్యాయం తలపెడితే దానికి తగినశిక్ష మీరనుభవిస్తారు. నన్ను మారువేషంలో వున్న వ్యక్తిగా మీరనుమానించినా నేనిప్పుడు నా ముఖాన్ని మీ ముందేమీ కడుక్కోదలచుకోలేదు.

భూత:- అలాగైతే నీ సంగతి ఆమూలాగ్రంగా తెలుసుకోవలసిందే నేనూ విడిచిపెట్టటానికి వీలులేదు.

ఆమె:- "ఒక ఆడదానిముందు మీరు మీ శౌర్య సాహసాలు చూపించవలసిన అవసరంలేదు" అనికన్నీరు కార్చసాగింది.

ఆమె పరిస్థితి దయనీయంగా మారింది. ఆమెను చూచినవారికి నిజంగానే జాలి వేస్తుంది. భూతనాథుడుకూడా ఆవిధంగానే జాలిచెంది ఆమె ముఖంలోకి చూడసాగాడు. దేవీసింహుడుకూడా ఆమె భూతనాథుని భార్య కాదనే నిశ్చయానికి వచ్చాడు. "అయితే నీవు భూతనాథుని భార్యవు కావన్నమాట" అన్నాడు దేవీసింహుడు.

ఆమె:- కాదంటు.

దేవీ:- ఎలా నిర్ధారణ చేసుకోనేది?

ఆమె:- కష్టమనుకోకుండా మీరు మాయింటికిరండి! అక్కడ నా యిల్లూవాకిలీ పిల్లాజెల్లలను చూస్తే మీకే నిజం తెలుస్తుంది.

దేవీ:- నీ యిల్లిక్కడికి ఎంతదూరంలో ఉన్నది?

ఆమె:- ఇక్కడికి చాలా దగ్గరే. ఆ కనిపించే చెట్ల గుబురు దాటితే మా యిల్లు ఉంటుంది.

దేవి - నిన్ను చూస్తే గొప్పయింటి ఆడపడుచువుగా కనిపిస్తున్నావు. నీ యిల్లు పూరిగుడిసెఎలా అవుతుంది?

ఆమె: మా పిల్లలు అనారోగ్యంగా ఉంటే మంచి గాలికోసం యిక్కడికి వచ్చాం. దయచేసి మీరు నావెంట రండి.

దేవిసింహుడు, భూతనాథునితో

"ఆమె యింటికివెళ్ళి నిజం తెలుసుకుందామంటావా?" అన్నాడు.

భూత:- నీ యిష్టం.

ఇద్దరూ ఆమెవెంట నడక సాగించారు. ఒక క్రోసుడు దూరం వెళ్ళిన తరువాత వారికొక పూరిగుడిసె కనిపించింది. ఇంటిని సమీపించి గుర్రాన్ని కట్టివేసినతరువాత ఆమె "కొద్దిగా మీరిక్కడ ఆగండి. లోపలికి వెళ్ళి మీకు మంచం తెస్తాను." అని లోనికి వెళ్ళింది.

ఎంతసేపటికీ ఆమె బైటికి రాలేదు. భూతనాథుడు పిలిచినా లాభంలేకపోయింది. చివరికి యిద్దరూ ఇంటిలోకి ప్రవేశించారు. లోపలకూడా ఎవరూ కన్పించలేదు. అక్కడ ఒక సొరంగంమాత్రం కన్పించింది. ఇంటిలో సామానులుకూడా ఏమీ లేవు.

భూతనాథుడు "చూచావా దేవీసింహా మనలను వట్టిదద్దమ్మలను చేసింది." సొరంగంలో ప్రవేశించి ఆమెను వెదకాలనే ఆలోచన భూతనాథునికి కలిగింది. మెఱుపుకత్తిని సింసిద్ధంగా పెట్టుకొని అతడు లోనికి ప్రవేశించాడు. దేవీసింహుడు అతని వెంట దిగాడు.

ఆ సారంగం రమారమి అయిదువందల అడుగులుంటుంది. దాని రెండవకొన ఆ అడవిలోని దట్టంగా ఎదిగిన చెట్లవద్ద అంతమైంది. ఇద్దరూ ఆ కొనకు చేరుకొన్నారు. ఆ స్త్రీ జాడ తెలియలేదు. దేవీసింహుడు ఇంటికి వెళ్ళిపోదామన్నాడు. భూతనాథుడు అందులకు అంగీకరించలేదు.

దేవి :- అయితే ఏంచేద్దామంటావు? ఈమెను వెదకటం కోసం ఇక్కడ నేనెక్కువ రోజులుండలేను. అటుచూస్తే విచారణ జరుగుతోంది. మహారాజులు ఏమనుకొంటారు?

భూత :- నిజమేననుకో! కాని, నా పరిస్థితిని నీవు గమనించాలి.

దేవి :- నీ పరిస్థితికేం? ఇంటికి వెడదాం పద! అక్కడ నా భార్య ఉన్నట్లయితే నీ భార్యనుగురించి నీవేమీ అనుమానపడవలసిన పనివుండదు.

భూత :- ఒకవేళ నీభార్య యింటివద్దనున్నా అనుమానం సమసిపోదు.

దేవి :- అలాగైతే నీభార్యను వెదకటానికి నీ మనుష్యులను పంపవచ్చుగా!

భూత :- వందచెప్పు! నాకు మనస్సంతా వికలమైపోయింది. క్షణక్షణానికి కోపం ముంచుకొనివస్తోంది.

దేవి :- అలాగైతే నీయిష్టం వచ్చినట్లు నీవు చెయ్యి. నేనుమాత్రం ఇంటికి వెళ్ళిపోతాను.

భూత :- సరేకాని మహారాజు నావిషయమై అడిగితే?

దేవి :- నేనేదో చెప్పి ఒప్పిస్తాను కాని, నీ వెన్నాళ్ళ తరువాత తిరిగి వస్తావో మాత్రం చెప్పు.

భూత :— మూడురోజులు చాలు. అంతకంటే ఎక్కువ ఉండవలసివస్తే నీకు కబురంపిస్తాను.

దేవి :— సరే. జై మాయకు.

భూత :— జై మాయకు.

7

దేవిసింహుడు ఇంటికి చేరిన తరువాత తిన్నగా వీరేంద్రసింహుని దగ్గరకు వెళ్ళాడు. అక్కడ తేజసింహుడున్నాడు. అతడు ఆ రాజమంత్రులకు భూతనాథుడూ తానూ పొందిన అనుభవాలు పూసగుచ్చినట్లు చెప్పాడు.

వీరే :— భూతనాథుణ్ణి వదలిపెట్టివచ్చి భలేపని చేశావు. నీవు లేకపోవటంవల్ల మునుగుమనుష్యుల ఎదుట మేము తల వంచుకోవలసి వస్తోంది.

దేవి :— ఏమిటీ! వాళ్ళిక్కడికి వచ్చారా ?

వీరేం :— అవును వాళ్ళు మామూలుగానే యిక్కడికి వచ్చారు. మీరిద్దరూ వాళ్ళను వెదకటానికి వెళ్ళారని తెలుసుకొని చాలా కించపడ్డారు. మీరిద్దరూ వాళ్ళయింటికి రాలేదని కూడా చెప్పారు.

దేవి :— వాళ్ళు చెప్పటానికేంగానీ, మేము వాళ్ళ యింటికి వెళ్ళాం.

వీరేం :— ఏదైనా మొత్తంమీద ఎలాగూ వాళ్ళు అవసరం వచ్చినప్పుడు తమ సంగతి బైటపెడతాం అంటున్నారు గనుక మనం వాళ్ళనుగురించి ఆరా తీయాలని ప్రయత్నించటం అనవసరం.

దేవి :- అవుననుకోండి! కానీ, ఏం చేస్తాం రహస్యాలు ఎంత త్వరగా బైటపడితే అంత మంచిదని ఇంద్రజాలికుడైన వాడు ఆతురత చెందకుండా ఉండలేడు కదా? ఆ ముసుగు మనుష్యులు తనకు ఉపకారం తలపెట్టిన వారేనని భూతనాథునికి తెలుసు. ఐనా అతడు వాళ్ళను వెన్నాడి ఫలితంగా దుఃఖాన్నే కొని తెచ్చుకోవచ్చు. ఐనా అతని ఆరాటం తీరదు. త్రోవలో అతనికి అతని భార్య కనిపించకపోతే మామూలుగా నీ వెంట వచ్చేవాడే.

తేజ :- కాని, ఫరవాలేదు. ముసుగు మనుష్యులు ఏమంత ప్రమాదకర మనుష్యులుగా కన్పించటంలేదు. భూతనాథుణ్ణి వాళ్ళేమీ చెయ్యరు.

వీరేం :- దేవీసింహా! నీ భార్యను చూడాలని నీవు చాలా బెంగ గొన్నావనుకొంటాను.

దేవీ:- అవునండీ.

వీరేం:- కాని, నీవు నీ భార్యను గురించి ఇంతవఱకు ఏమీ అడగలేదే?

దేవీ:- ఎందుకండీ అడగటం? ఈ సందర్భంలో మీరు నిజం చెపుతారని నేను భావించటంలేదు.

వీరేం :- అలాగైతే నీవే అంతఃపురంలోకి వెళ్ళిచూడు.

అంతఃపురాంతర్భాగంలో చంప రోహితగఢపు దుర్గం యొక్క ప్రతిరూపాన్ని చిత్రిస్తోంది. పరిచారిక లిద్దరు ఆమెకు దీపాలుచూపుతూ సహాయపడుతున్నారు. వెనుకనుంచి వచ్చిన దేవీసింహుడు చంపను చూచి ఆశ్చర్యచకితు డయ్యాడు. చంప చిత్రలేఖనంలో నిమగ్నురాలై ఉన్నది. దేవీసింహుడు

అదివరకు చంప చిత్రించిన అనేక చిత్రాలను చూచేఉన్నాడు. కాని ప్రస్తుతం ఆమె చిత్రిస్తున్న దుర్గంయొక్క చిత్రాన్ని చూచి ఆశ్చర్య చకితుడయినాడు. సరిగా అటువంటి చిత్రమే ముసుగుమనుష్యుల యింట్లో తాను భూతనాథునితో కూడా కలసి చూచాడు. సాధారణంగా ఒక భవనాన్ని ఇద్దరు చిత్రకారులు చిత్రిస్తే అది ఒకే మోస్తరుగా ఉండటంలో ఏమంత అసహజత్వం కనిపించదు. ముసుగు మనుష్యుల యింట్లో గల రోహితాశ్వ పర్వతం యొక్క చిత్రాన్ని దేవీసింహుడు చూచినప్పుడు ఆ చిత్రంలో ఇద్దరు ముసుగు మనుష్యులు గుఱ్ఱాలమీద పర్వతం ఎక్కుతున్నట్లు చిత్రితమై ఉన్నది. ఆ గుఱ్ఱాలలో ఒకటి నల్లగానూ, మరొకటి పచ్చగానూ కన్పించాయి. ప్రస్తుతం చంప చిత్రిస్తున్న చిత్రంలో కూడా అదే రకమైన గుఱ్ఱాలు అదేచోట అదేవిధంగా ఉన్నట్లు కనబడుతున్నాయి. దేవీసింహుడు ఈ విషయాన్ని కాకతాళీయంగా భావించి సంతృప్తి చెందలేక పోయాడు. అతనికి చంప ముసుగు మనుష్యుల యింటికి వెళ్ళే ఉంటుందనే అనుమానం మొలకెత్తింది. అక్కడి చిత్రాన్ని ఒకసారి చూడనిదే చంప అదే రకమైన చిత్రాన్ని ఇక్కడ తయారు చెయ్యగలగటం అసంభవంగా తోచిందతనికి. అయితే చంప తాను ముసుగు మనుష్యుల యింటికి వెళ్ళినవిషయం దాచి వుంచాలనే ప్రయత్నం చేస్తున్నట్లు కన్పించలేదు. అదే నిజమైతే ముసుగు మనుష్యుల యింట తననుచూచి ఎందుకు కన్పించకుండా పోయింది?

దేవీసింహుని అడుగుల చప్పుడు విని చంప వెనుదిరిగి

చూచింది. దేవీసింహుడు కంటపడగానే ఆమె కుంచెలనూ, రంగులనూ అక్కడ విడిచి అతనికి అభివాదం చేసింది.

"ఎప్పుడు వచ్చారు ?"

"నాలుగైదు గంటలైఉంటుంది. ఇక్కడికి వచ్చికూడా ఒక అరగంట అయిఉంటుంది."

"అయితే దొంగతనంగా ఏమిచూస్తున్నారో ? "

"ఆ చిత్రాన్ని దాని నైపుణ్యాన్ని చూస్తూ నిలబడి పోయాను"

"అలాగా రండి ! కూర్చోండి."

"నీవు కూర్చున్న కుర్చీలో కూర్చోండి నీ పటాన్ని సావకాశంగా పరిశీలిస్తాను." అని చంప కూర్చున్న కుర్చీలో కూర్చుండి దేవీసింహుడు చిత్రపటాన్ని అవలోకించసాగాడు. కుర్చీ వెనుకభాగాన చంప నిలుచున్నది. దేవీసింహుడు కుంచె తీసుకొని దుర్గంపైన ఒక బురుజును చిత్రించి దానిపై పతకాన్ని కూడా వ్రాశాడు.

చంపః- అవునవును ! నేనది వేయటం మరచిపోయాను. ఇక మీరుండండి. నేను పూర్తిచేస్తాను. ఆ తరువాత మీరు ఇంకా నేనేం మరచిపోయానో చెబుదురుగాని.

దేవీ :- సరేకాని, అక్కడ నన్ను చూచి ఎందుకు పారిపోయావు ?

చంప :- ఎప్పుడూ ? ఎక్కడా ?

దేవీ :- ఆ మునుగు మనుష్యులున్న చోట.

చంప :- ఎప్పటిసంగతి మాట్లాడుతున్నారో నా కర్థం కాకుండా ఉన్నది.

దేవీ :- నీ దొంగవెత్తులు నా దగ్గర కుదరవులే.

చంప :- ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. నాకేం తెలియదు.

దేవీసింహుని ఆశ్చర్యానికి మేరలేదు. చంప సత్యా సంధురాలని అతనికి సంపూర్ణంగా విశ్వాసమున్నది. అయితే నిన్నా మొన్నా నీ వెక్కడికి వెళ్ళావు?" "అని ప్రశ్నించా డతడు.

చంప :- ఎక్కడికి వెళ్ళలేదే ?

దేవీ :- అయితే ఈ చిత్రాన్ని నీ వెక్కడ చూచావు?

చంప ఒక మూటను దేవీసింహుని ముందుంచింది. అతడు ఆ మూటవిప్పి "ఈచిత్రం నీకెక్కడ దొరకింది ?" అని అడిగాడు.

చంప :- ఆ సంగతి నేను తరువాత చెబుతాగాని ముందుగా మీరీ చిత్రాన్ని చూచి ఎందుకు ఆశ్చర్యపడ్డారో చెప్పండి ! ఈచిత్రం నిజానికి ఎక్కడిది ?

దేవీ :- ముసుగు మనుష్యుల యింట్లో ఈ చిత్రం ఉన్నది. వాళ్ళను గురించే నిన్నిప్పుడు అడుగుతున్నాను.

చంప :- రాజసభకు వస్తూఉండే ముసుగు మనుష్యు లేనా ?

దేవీ :- అవును. వాళ్ళ యింటివద్దనే నేను నిన్ను చూచాను.

చంప:- మీరు చెప్పేది నాకేం అర్థంకావటంలేదు. ఇంతకూ ఏమిజరిగిందో సవిస్తరంగా చెప్పండి.

దేవసింహుడు భూతనాథుడూ తానూ చేసిన ప్రయాణాన్ని వివరించి "ఈ చిత్రం అక్కడిదే" అన్నాడు.

చంప:- ఇప్పుడు నాకు అర్థమైంది. నే నా యింటికి వెళ్ళలేదు.

"అయితే నీకీచిత్రం ఎలా లభించింది."

చంప:- ఈ చిత్రాన్ని మన సిల్లివాడు తారాసింహుడు ఇచ్చాడు.

దేవ:- నీ వడిగావా ఈ చిత్రం ఎక్కడిదో?

చంప:- నే నడగలేదు.

దేవ:- ఎన్నాళ్ళయింది నీకీ చిత్రమిచ్చి?

చంప:- అయిదారురోజులై వుంటుంది.

దేవసింహుడు కొంతసేపు ఆమెవద్ద కూర్చున్నమీదట గుడ్డచుట్టిన చిత్రపటాన్ని తనవెంట తీసుకొని బైటికివెళ్ళాడు.

## 8

అంతఃపురాన్ని విడిచివచ్చిన దేవసింహుని మనస్సు పరిపరివిధాల ఆలోచనలతో నిండిపోయింది. చాలారాత్రి అయినప్పటికీ ఆ చిత్రపటాన్నిగూర్చి వీరేంద్రసింహునితో ముచ్చటించటంకోసం దేవసింహుడు మహారాజుదగ్గరకు వెళ్ళాడు.

వీరేం:- ఏమిటయ్యా యింతప్రొద్దుపోయి వచ్చావు? చంప నిన్నింత తొందరగానే బైటికి రానిచ్చింది?

దేవ:- అత్యాశ్చర్యకరమైనవిషయం మీకు తెలియచెప్పటానికి వచ్చాను.

వీరేం:- ఏమిటాసంగతి? నీ చేతిలో గుడ్డచుట్టినదేమిటి?

దేవి:- ఈ వస్తువే మీకు చూపాలని వచ్చాను.

అతడు చిత్రపటాన్ని విప్పి మహారాజుకు చూపించి "తారాసింహునికి ఈ చిత్రపటం ఎక్కడదొరికిందో అర్థం కావటంలేదు. దీనిని తనతల్లి చేతికెందుకిచ్చాడో కూడా దురూహ్యం" అన్నాడు.

వీరేం:- అతడినే అడగకపోయావా ?

దేవి:- పిలవమంటారా?

వీరేం:- పిలూ!

కబురంపించినవాడు తిరిగివచ్చి "ఆయనలేడు. ఎక్కడకు వెళ్ళాడో తెలియదు. సాయంకాలంనుంచీ కనిపించటం లేదట" అని చెప్పాడు.

తరువాత భైరవసింహునికోసం కబురువెళ్ళగా అతడు వచ్చాడు.

వీరేం:- భైరవసింహా! తారాసింహుడు ఎక్కడికి వెళ్ళాడో నీకు తెలుసా?

భైరవ:- సాయంకాలంనుంచీ అతడు కనిపించటంలేదండీ. మధ్యాహ్నం ఒకసారి కనిపించాడు. అప్పుడతడు ఎందుకనో ఉదాసీనంగా వున్నాడు. నేనడిగితే ఏమీ చెప్పలేదు.

వీరేం:- ఆశ్చర్యంగా వున్నదే!

భైరవ:- ఇప్పుడతడు ఎందుకండీ.

దేవీసింహుడు భైరవసింహునికి జరిగినదంతా చెప్పాడు.

భైరవ:- ఈ చిత్రపటం తారాసింహునికి ఎప్పుడు ఎక్కడ దొరికిందో నాకూ తెలియదు. ఈ రహస్యాన్ని ప్రయత్నించి తెలుసుకుంటాను.

ఇలా చెప్పి భైరవసింహుడు నిష్క్రమించాడు. దేవీ సింహుడుకూడా వెళ్ళిపోయాడు.

మరునాడు రాజసభలో కూడా ఈ విషయాన్ని గురించే సమాలోచన జరిగింది. సభలో వీరేంద్రుడూ అతని ఇంద్రజాలికులూ తప్ప ఇతరులు ఎవ్వరూ లేరు. నాటికి మూడు రోజుల క్రిందట ముసుగు మనుష్యులు వచ్చి రాకుమారుల వృత్తాంతాన్ని వినిపించి వెళ్ళారు. ఆ తరువాత ముసుగు మనుష్యులుకూడా రావటంలేదు. భూతనాథుని సంగతి అర్థంకాలేదు. అట్టి సమయంలో ముసుగు మనుష్యులు వచ్చినట్లుగా సమాచారం అందింది. రాజానుమతితో ముసుగు మనుష్యులు వచ్చి కూర్చున్నారు.

ముసుగు:- బహుశః మూడురోజులనుంచీ మేమెందుకని రావటంలేదో ప్రభువులవారికి ఆశ్చర్యం కలిగించి ఉండవచ్చు.

వీరేం:- అవును! మాకు రాకుమారుల విశేషాలు మీ ద్వారా తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉన్నది.

ముసుగు:- భూతనాథుడు మమ్మల్ని వెదకటానికి వెళ్ళియింకా రాలేదని తెలిసింది. అందుచేత విచారణ జరగదని తెలిసి మేము రాలేదు. దానికంటే మించి రాకుమారుల విషయాలు తెలుసుకోటానికి ఇంద్రజాలానికి వెళ్ళేపని కలిగింది.

వీరేం:- మీరక్కడికి తలచుకొన్నప్పుడు నిరాటంకంగా వెళ్ళగలరా?

ముసుగు:- కొన్ని కొన్ని చోట్లకుమాత్రం వెళ్ళగలం. అదైనా మాగురువుగారు లోగడ వెళ్లుతూఉండే ప్రదేశాలైతేనే?

వీరేం:- మీగురు వెవరు?

ముసుగు:- వారు పరమపదించారు.

వీరే:- అలాగా! ఇంతకీ మీరు మా చిరంజీవులను కలుసుకొన్నారా?

ముసుగు:- కలుసుకోలేదనుకోండి! అయినా వారి సంగతులన్నీ మాకు తెలిశాయి. అవన్నీ మీకు చెబుతాముకూడా. ఏమండీ దేవిసింహులవారూ! భూతనాథుణ్ణి ఒంటరిగానే విడిచి వచ్చారేం?

దేవి:- ఏం చెయ్యమంటావు? మీ యథార్థ వృత్తాంతం తెలుసుకోవాలనే పట్టుదల నాకంటె భూతనాథునికే ఎక్కువ. ఆనాడు నేను వచ్చిందికూడా కేవలం భూతనాథుడు ఏం చేస్తాడో ఎక్కడికి వెళతాడో చూద్దామనే. ఆ చిన్నపనికే నాకు ప్రాణాంతకమైంది.

ముసుగు:- కాని భూతనాథునికింకా ఆశ వదలలేదు కాబోలునే!

తేజ:- అతడొక విచిత్రమైన వ్యక్తి. మీరెలాగూ అతనికి సహాయపడేవారని తెలిసికూడా ఎందుకో అనవసరంగా మీ వెంట పడ్డాడు. ఇంతకూ మీ ద్వారా అతనికేమీ అపకారం జరగదని భావిస్తున్నాను.

ముసుగు :- అపచారమూ! అబ్బే! మేం అలాటిపని చెయ్యం. మహారాజా మీరు మమ్మల్ని మీ కుమారులుగా భావించుకోండి! మీ యింద్రజాలికులు మమ్మల్ని ఒకవేళ బాధించినా మేము మాత్రం వాళ్ళపై చెయ్యి చేసుకోం.

వీరేం :- శెబాస. మా వాళ్ళుకూడా మీ కేమీ ఇబ్బందిని కలుగజేయ్యరు లెండి!

దేవి :- నిన్నటినుంచి నేనొక పెద్ద చిక్కులో పడ్డానయ్యా.

ముసుగు:- ఏమిటది ?

దేవి :- మా వాడు అంతులేకుండా పోయాడు. ఎక్కడికి వెళ్ళాడో? ఏమిటో?

ముసుగు :- ఎక్కడికి వెళతాడేమిటి ? కొంతసేపట్లోనే రాడూ ?

దేవి :- అయితే మీకు మావాడిసంగతి తెలుసునన్నమాట.

ముసుగు:- తెలియకేం? తెలుసు. అతణ్ణి అడగండి ఆ సంగతులన్నీ. మహాప్రభూ ! మీ చిరంజీవుల దగ్గరనుంచీ యివ్వాళ మాకొక ఉత్తరంవచ్చింది. ఆ ఉత్తరంలో మమ్మల్ని మీదగ్గరకువెళ్ళి భైరవసింహుణ్ణి, తారాసింహుణ్ణి తొందరగా ఇంద్రజాలానికి పంపించవలసిందని మీకు విన్నవించమని వ్రాశారు. వాళ్ళిద్దరూ లేకపోతే అక్కడ బొత్తిగా పనిజరగటం లేదట. ఇదుగో ! మీ పేరకూడా ఒక ఉత్తరం పంపించారు.

ముసుగుమానిసి మహారాజుకు ఒక లేఖ యిచ్చాడు.

వీరేంద్రుడు:— తిన్నగా నా దగ్గరకే వచ్చాక మధ్యలో మీ కెందుకు శ్రమ కారా.

మునుగు:— వారు స్వయంగా ఇంద్రజాలం బైటికి రాలేరు. ఇంకొకరిని పంపించలేరు కూడా. మా మనుష్యులు ఎప్పుడైనా అక్కడికి సంగతులు తెలుసుకొని రావటానికి వెళ్ళు తుంటారు గనుక వాళ్ళచేతి కిచ్చారు.

వీరేంద్రసింహుడు ఉత్తరాన్ని చదవటం ప్రారంభిం చాడు. అందులో—

"పూజ్యులైన తండ్రిగారికి,

నమస్కారములు.

మేమిక్కడ క్షేమంగానే వున్నాము. ఇంద్రజాలాన్ని భేదిస్తున్నాం. కాని మాకు సహాయంగా ఎవరూ లేకపోవటం వల్ల కొంచెం కష్టంగానే వున్నది. అందుచేత ఈ ఉత్తరాన్ని చూచిన తక్షణమే భైరసింహుణ్ణి, తారాసింహుణ్ణి ఇక్కడికి పంపించండి! దేవునిదయవల్ల మాకిక్కడ రామసింహుడు, లక్ష్మణసింహుడనే యిద్దరు మిత్రులు లభించారు. వాళ్ళిద్దరూ సాధువు మాయారాణుల రహస్యాలు పూర్తిగా ఎరుగుదురు. ఖైదీల అపరాధ విచారణ చేసే సందర్భంలో మీరు వాళ్ళిద్దర్నీ దగ్గర వుంచుకుంటే న్యాయవిచారణ బహుసులభమని ఆశిస్తు న్నాము. వాళ్ళిద్దరిద్వారానే మా సోదరులిద్దరియొక్క క్షేమ సమాచారాలు మీకు తెలియగలవు. భైరవసింహుణ్ణి తారా సింహుణ్ణికూడా వాళ్ళిద్దరూ మాదగ్గరకు పంపించగలరు. గోపాలసింహ అన్నయ్యగారితో ఆయన స్నేహితుడైన భరత సింహుడు మాకిక్కడ కలిశాడని చెప్పండి. ఆయనను సాధువు

వైద్యం చేశాడు. దేవుని దయవల్ల ఆయన బ్రతికి బయటపడ్డాడు. అన్నయ్యగారూ, మీ దగ్గరనుంచి వెళ్ళేటప్పుడు చెరువులోని తాలవనంగురించి చెప్పిన రహస్యాలన్నీ సరిగానే బయటపడ్డాయి. చంద్రవతాకం నాకు దొరికింది.

వి న మ్రు లై న
మీ కు మా రు లు."

వీరేంద్రసింహుడా ఉత్తరాన్ని గోపాలసింహుని చేతి కిచ్చాడు. గోపాలసింహుడు చాలా సంతోషించి "ఇది ఇంద్రజిత్సింహుని దస్తూరి. నేను చెప్పిన రహస్యాలు బైటపడినందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. భరతసింహుడు దొరకటం కూడా చాలా అదృష్టం. ఏమయ్యా మీరేనన్నమాట రామ సింహా, లక్ష్మణసింహులు." అని ఆ ఉత్తరాన్ని తేజసింహుని కిచ్చాడు. ఆ ప్రకారంగానే అక్కడి ఇంద్రజాలికులందరూ ఆ ఉత్తరాన్ని చదువుకొన్నారు. అప్పుడే తారాసింహుడు వచ్చాడు. ముసుగు మనుష్యులకు తారాసింహుని వృత్తాంతం ఎలా తెలిసిందో అనే అనుమానం అందరికి పట్టుకొన్నది. ముసుగు మనుషుల యెదుటగా తారాసింహుణ్ణి చిత్రవట విశేషాలు అడగటం ఎందుకులే అని ఊరకున్నారు వారు.

ముసుగు :- చూచారా మహాప్రభూ. తారాసింహుడు రానేవచ్చాడు. ఇక మమ్మల్నిద్దరినీ ఏంచెయ్యమంటారు? భైరవసింహుణ్ణీ, తారాసింహుణ్ణి రాకుమారులవద్దకు పంపిస్తారా?

తేజ :- అలాగే. రేపు మీ వెంట పంపిస్తాం.

ముసుగు :- చిత్తం. వెళ్ళివస్తాం.

తేజ :— రాకుమారుల సంగతి చెప్పకుండానే వెడతా రేమండీ !

ముసుగు :— ఇప్పటికే చాలా ఆలస్యమైంది. అయినా మహాప్రభువులవారు చెప్పండని ఆజ్ఞాపిస్తే మాకేం అభ్యంతరం లేదు. ఇంతకూ సురేంద్రసింహ మహారాజులుంగారిని పిలవండి మరి.

ఆ ప్రకారమే సురేంద్రసింహ మహారాజులుంగారిని తీసుకురావటం జరిగింది.

## 9

కేవలం స్వపక్షీయులుమాత్రమే హాజరైఉన్న రాజ దర్బారులో ముసుగుమనుష్యులు రాకుమారుల ఇంద్రజాల విశేషాలను గురించి చెప్పసాగారు.

“రాకుమారు లిద్దరూ ఆ రాత్రి ఆ ఐదుగురు బంధీల తోనూ గడిపారు. తెల్లవారింది. రాకుమారు లిద్దరూ ఆప్రదే శానికి నడుమనున్న బురుజుదగ్గరకువెళ్ళి చుట్టూ ఉన్న వేదిక రాళ్ళను పరీక్షగా చూడసాగారు. ఆ రాళ్ళమీద అక్క డక్కడా అక్షరాలూ అంకెలూ చెక్కి ఉన్నాయి. ఇంద్ర జీతసింహుడూ అంకెలనూ అక్షరాలనూ పరీక్షించి ఒక నలు చదరపు రాతిమీద చేతినుంచి ‘ఈ రాతినే పెకలించాలి’ అన్నాడు తమ్మునితో. అన్నగారి మాటను సోదరుడు శిరసా వహించాడు. తన మెఱుపు కత్తితో ఆ రాతిని పెకలించి వేశాడు.

ఆ రాతి అడుగున ఒక నాగవాసానికి తగిలించిన గొళ్ళెం కనిపించింది. ఇంద్రజీతుడా గొళ్ళాన్ని తీయటం ప్రారంభించాడు. ఆ గొళ్ళెం తీసేసరికి చుట్టూ ఉన్న అరుగు రాళ్ళు అప్రయత్నంగానే తొలగిపోయాయి. అప్పుడు దిగువనున్న చీకటికొట్లోనికి వెళ్ళటానికొక త్రోవా, బురుజు పైకెక్కటానికి మరొక త్రోవా కన్పించాయి. మొదట సోదరులిద్దరూ బురుజు మీదకెక్కి చుట్టూ వ్యాపించివున్న తోటనూ అందులోని భవనాలనూ చూచారు. తరువాత క్రిందికి దిగివచ్చి ఖైదీలతో అక్కడ ఉండండని చెప్పి యిద్దరూ చీకటికొట్లోకి వెళ్ళారు. మెరుపుకత్తి సహాయంతో ఆగదిని పరికించసాగారు. ఆగదిమధ్య ఒక అరుగున్నది. ఆ వేదికమీద లోహనిర్మితమైన బెబ్బులి వున్నది. ఆ బెబ్బులి బొమ్మ చూడటానికి చాలా భయంకరంగా ఉన్నది. దాని సమీపాన నేలమీద ఒక సుత్తివున్నది. ఇంద్రజీతసింహుడు ఆ పులిబొమ్మ తల నిమురసాగాడు.

ఆ పులి ఎడమచెవిలో వ్రేలుపట్టేటంత బెజ్జమున్నది. ఇంద్రజీతసింహుడు తన జేబులోనుంచి ఒక మేకును తీసి ఆ బెజ్జంలో పెట్టి సుత్తితో గట్టిగా కొట్టాడు. ఆ తరువాత వెంటనే సోదరులిద్దరూ బైటికి వచ్చారు.

పులిచెవిలో కొట్టిన ఆ మేకులాటివస్తువు ఒకచోట ఒక బొమ్మయొక్క పొట్టలో దొరికింది.

రాకుమారులిద్దరూ బైటికివచ్చినమీదట చీకటికొట్టులో పెద్దరణగుణధ్వని బయలు దేరింది. ఆవిధంగా ఒక జాము ప్రొద్దెక్కే వరకూ ఆధ్వని కొనసాగి తరువాత అంతమైంది. మధ్యాహ్నం ఖైదీలతో రాకుమారులు చీకటికొట్టులోనికి వెళ్ళారు. పులి

శూన్యమున్న చోట క్రిందికిపోక మార్గమున్నది అక్కడనుంచి ఖైదీలతో రాకుమారులు సొరంగపుమార్గాన్ని ప్రవేశించారు. కొద్దిదూరం వెళ్ళినతరువాత వారికి ఒకగది కనిపించింది ఆగది దాటినతరువాతకూడా సొరంగమున్నట్లుగా ఎదురుగుండావున్న వాకిలిగుండా కన్పిస్తోంది. ఆగదిలో రకరకాల ఆయుధాలూ, మణులూ, మాణిక్యాలూ మొదలైన అమూల్యవస్తువులు రాసులుగా పోసిఉన్నాయి. ఖైదీలలో ఒకడు ఇంద్రజిత్‌సింహునితో "ఈధనరాసులను ఇక్కడఎందుకుపెట్టారూ?" అన్నాడు.

ఇంద్ర:- మాకోసమే! ఇవేకాదు. ఇంకా ఎన్నోచోట్ల ఇంతకంటే ఎక్కువసంపద మాకు లభిస్తుంది.

ఖైదీ:- వీటినన్నిటినీ బైటికి ఎట్లా చేర వేస్తారూ?

ఇంద్ర:- ఈ యింద్రజాలాన్ని ఛేదిస్తూ మేము చునార గఢాన్ని చేరుకొనేటప్పుడు ఈ వస్తువులనన్నిటినీ తీసుకు వెడతాం.

ఖైదీ:- అందాకా వీటిని ఇలానే వుంచుతారా ?

ఇంద్ర:- అవును.

అక్కడనుండి తిరిగి సొరంగపు మార్గాన ప్రవేశించి వారు ముందుకు సాగారు. దాదాపు రెండు క్రోసులు వెళ్ళిన తరువాత మరొకగది కన్పించింది. మొదటి గది మోస్తరుగానే యీ గది దాటిన తర్వాతకూడా ఇంకా సొరంగం ఉన్నట్లు కన్పిస్తోంది. ఆ గదిలో గోడలకు చిత్రపటాలు మాత్రమే వ్రేలాడుతున్నాయి. ఆ పటాలలో ఎక్కువభాగం రోహిత గఢానివి. చునారగఢానివి మాత్రమే. రాకుమారులా చిత్ర పటాలను పరీక్షగా చూచారు.

ఇంద్ర:– బ్రహ్మమండలం ఇక్కడే ఉన్నట్లున్నది. ఇక్కడే మనారగథపు ఇంద్రజాలంయొక్క తాళంచెవి మనకు లభిస్తుంది.

ఆనం:– అవును. ఇది బ్రహ్మమండల మనటంలో సందేహంలేదు.

ఇంద్ర:– మరి నీ ఉద్దేశం ఏమిటి? ఇక్కడేదైనా పని ప్రారంభిద్దామా వద్దా?

ఆనం:– నా ఉద్దేశంలో ఇప్పుడిక్కడ మనమేమీ చెయ్యరాదు. ఈ ఖైదీలను మొదట బైటికి పంపించి వేద్దాం. ఆ తరువాత మనం చెయ్యదలచుకొన్నది చేద్దాం.

ఇంద్ర:– నా ఉద్దేశమూ అదే! మనమిక్కడికి ఎలాగూ చాలాసార్లు రావలసి ఉంటుంది. కనుక ఇప్పుడు మనం ఏదైనా పనిప్రారంభిస్తే బయటికి వెళ్ళటం ఆలస్యమవుతుంది.

అనిముందుకు నడిచాడు. అందరూ అతని వెనుక సొరంగపుమార్గం పట్టారు. ఎన్నో క్రోసుల దూరం నడిచిన తరువాత సొరంగాన్ని గడచారు. అప్పటికి తెల్లవారింది. రాకుమారులు జమానియాను విడిచి చాలా దూరం వచ్చినట్లూ దాదాపు పధ్నాలుగు పదునైదుగంటలు నడచినట్లూ అంచనా వేశారు.

వారిప్పుడు ప్రవేశించినది ఒక రమణీయమైన లోయ. నలువైపులా ఎత్తైన పర్వత శ్రేణులు ఉన్నాయి.

ఇంద్ర:– (ఖైదీలతో) ఇక మీరు కారాగారంనుండి విడుదలయ్యారు. కొద్దిసేపైనతరువాత మిమ్మల్ని యీ లోయనుండి బైటికి పంపించి వేస్తాం. ఆ తరువాత మీరు మాయిష్టం వచ్చినచోటికి వెళ్ళిపోవచ్చు.

యువరాజుకు ఖైదీలు చేతులెత్తి నమస్కరించి "ప్రభూ మీపాదాలను విడిచి మేమెక్కడికీ వెళ్ళలేము. మమ్మల్ని నానా హింసలూ పెట్టిన శత్రువులపై మీ సహాయంతోనే పగ తీర్చుకోవాలని ఉన్నది. అందుచేత మీతోపాటు మేమూ వీరేంద్రసింహ మహారాజు దర్బారుకు వస్తాము" అన్నారు.

రాకుమారు లిద్దరూ ఖైదీల విజ్ఞప్తిని హృదయపూర్వకంగా ఆమోదించారు. ఆ తరువాత జరిగిన విశేషాలను మీకు మరొక రోజు వివరిస్తాము.

ముసుగుమనిషి అంతటితో మౌనం వహించాడు మహారాజు రాకుమారుల యొక్క విశేషాలను ఇంకా తెలుసుకోవాలని మనస్సులో అభిలాష ఉన్నా ముసుగు మనుష్యులకు నాటికి శెలవిచ్చి పంపివేశాడు.

# 10

దేవీసింహుణ్ణి విడిచిపెట్టిన తరువాత భూతనాథుడు ఏంచేశాడో తెలుసుకొందాము.

వాస్తవానికి భూతనాథుడు ఒక విచిత్రమైన ఇంద్రజాలికుడు. అతడు శక్తిమంతుడేగాక తానుపట్టిన పట్టును విడువని కర్తవ్యపరాయణుడు. నిర్భయస్థుడు కూడా. ఒకానొకప్పుడు అతడు చేసిన దోషంవల్ల తన మాయావి జీవితంలో ఏర్పడిన కళంకాన్ని బయల్పడకుండా నిరోధించి వీరేంద్రసింహ మహారాజుల ఇంద్రజాలికుడుగా చలామణి కాదలచుకొన్నా అతడు తన కర్తవ్య నిర్వహణలో ప్రాణాలను సయితం బలిగా ఒడ్డటానికి సంసిద్ధంగానే ఉన్నాడు. ఆ దృష్టితోనే అతడిప్పుడు

ముసుగు మనుష్యులను వెన్నాడిన కార్యక్రమాన్ని తెలుసుకొందాం.

ప్రొద్దుక్రుంకటానికి ఇంకొక గంట ఆలస్యమున్నది. ముసుగు మనుష్యుల నివాసం ఉన్న గుహాయొక్క ముఖద్వారందగ్గర ఇద్దరు ముసుగుమనుష్యులు కత్తీ డాలూ పుచ్చుకొని అటూ ఇటూ తిరుగుతున్నారు. వారి వేషాలు చాలా సాధారణంగా కన్పిస్తున్నాయి. శరీరం అంత బలిష్ఠమైందిగా కూడా కన్పించటంలేదు. వాళ్ళక్కడ ఎంతసేపటినుండీ అలా తిరుగుతున్నారో తెలియదుగాని మొత్తంమీద ఎవరి రాకకోసమో ప్రతీక్షిస్తున్నట్లు మాత్రం కన్పిస్తున్నారు. ఆ సమయంలో ఒక సాధారణవ్యక్తి వారిదగ్గరకు వచ్చాడు. అతడు చాలాదూరం ప్రయాణం చేసినట్లుగా కన్పిస్తున్నాడు.

ముసుగు " ఎవరవు నీవు ? ఏంకావాలి ?" అని అడిగాడు.

ముసుగుమానిసికి సమాధానంగా ఆ వ్యక్తి సంజ్ఞమాత్రంగా అక్కడికి కొద్దిదూరంలో ఎవరో ఒకరిని చంపుతున్నారని వివరించాడు.

"నీవు మూగవాడివా ?" అని ప్రశ్నించాడు ముసుగుమానిసి.

అప్పటికీ ఆ వ్యక్తి ఏమీ సమాధానం చెప్పకుండా ముసుగుమనుష్యులను తనవెంట రమ్మన్నట్లు సంజ్ఞచేశాడు.

ముసుగుమనుష్యులకు ఆ వచ్చిన వ్యక్తి మూగవాడేగాక చెవిటివాడనికూడా విశ్వాసం కలిగింది. ఆ యిద్దరిలో ఒకడు "ఇతనితోపాటు వెడదామా" అని రెండవవాణ్ణి అడిగాడు.

ముసుగు మనుష్యులిద్దరూ ఆ వచ్చిన వ్యక్తి ననుసరించారు. కొద్దిదూరం వెళ్ళిన తరువాత త్రోవలో చాలా రూపాయలూ, స్త్రీలు ధరించే రెండు మూడు నగలూ, ఆవ్యక్తి ముసుగు మనుష్యులకు చూపించాడు. అతణ్ణి ఆ నగలు మొదలయినవి తీసుకోవలసిందని ముసుగుమనుష్యు లన్నారు. కాని ఆ మూగవాడు వాటిని తీసుకోకుండా వాళ్ళతో ముందుకు సాగాడు. మరి కొంతదూరం వెళ్ళినతరువాత మరికొన్ని నగలూ తెగిపడిన చెయ్యీ కన్పించాయి.

"ఇదంతా ఏమిటి?" అన్నాడు ముసుగుమానిసి తన ప్రక్కనున్న ముసుగుమానిసితో.

"అవును ఇదంతా ఏమిటో అయోమయంగానే వున్నది." అన్నాడు.

"ఇది స్త్రీ హస్తంలాగా కన్పిస్తోంది. బహుశః ఈ నగలుకూడా ఆమెవే అయివుండవచ్చు."

"అవును! దీని రహస్యం తెలుసుకోటానికి మన నాయకుణ్ణి హెచ్చరించటం మంచిది."

ఆ సమయంలో అక్కడికి కొంచెం దూరంనుండి స్త్రీ యేడ్పు విన్పించింది. ముసుగు మనుష్యులు ముందుకుసాగారు.

ఆస్త్రీ ఒక ధనవంతుని యింటిబిడ్డలాగా కన్పిస్తుంది. ఆమె తన రెండుచేతులతోనూ నెత్తీ నోరూ కొట్టుకొని యేడుస్తోంది. ఆమె సమీపాన ఒక స్త్రీ శవం వున్నది. ఆ శవానికి ఒక చెయ్యిలేదు.

ఆమెతో ముసుగుమానిసి "ఈమెయెవరు? ఎవరీమెను చంపింది?" అన్నాడు.

ఆమె :- ఎవరు చంపారో నాకేం తెలుస్తుంది? మీ అనుచరులే ఎవరో చంపి వుంటారు. ఇక నన్ను చంపి కసితీర్చుకో.

ముసుగు :- ఏమన్నావు? మేము ఆడవాళ్ళను చంపేటంత పౌరుషహీనుల మనుకొన్నావా?

ఆమె :- అవును! నేనలా అనుకొంటున్నాను. మీరు కాకపోయినా మీలాంటి ముసుగు మనుష్యులే ఈమెను చంపారు. ఆ వ్యక్తి స్త్రీ అయినా పురుషుడైనా నేను పగ సాధించుకోవటమో లేక యీమెవలెనే ప్రాణత్యాగం చెయ్యటమో చేస్తాను.

ముసుగు :- నువ్వెవరితో మాట్లాడుతున్నావు. మా అనుచరులే యీమెను చంపారని నీవెలా ఋజువు పరచగలవు?

ఆమె :- మీతోనే మాట్లాడుతున్నాను. మీ వాళ్ళ ఈమెను చంపారని నిస్సందేహంగా చెప్పగలను.

ముసుగు :- నువ్వు ఆడదానివైపోయావు. మరే మగవాడైనా ఇలా మాట్లాడితే ఏం చేసేవాడినో!

ఆమె :- నేను పొరపాటుపడితే పడి వుండవచ్చు గాని యీమెను చంపినవాడు నీలాంటి వ్యక్తే.

ముసుగు:- అసలు నీవు నీ సంగతీ యీమెసంగతీ యేమిటో చెప్పు! అసలు రహస్యం బైటపడుతుంది.

ఆమె:- ఇక్కడ నేనేమీ చెప్పను. మమ్మల్ని బాధించిన వాళ్ళమీరాను నీవు చెండకపోయినట్లయితే మగవాడివే గనుక అయితే నన్ను మీ నాయకునిదగ్గరకు తీసుకువెళ్లు! అక్కడ అన్నిసంగతులూ చెబుతాను.

ముసుగు:- అలా వీలుపడదు.

ఆమె:- అయినప్పుడు మారే యీపని చేసిందని నే
నెందుకు విశ్వసించకూడదూ?

ముసుగుమనుష్యులకు తమ నాయకునిదగ్గరకు ఆమెను
తీసుకొని వెళ్ళటానికి ఏమాత్రం ఇష్టంలేదు. అయినా ఆ స్త్రీ
వేసిన చిక్కు-ప్రశ్నలకు సమాధానం చెప్పలేనందుకు ఆమెతో
పాటు శవాన్నికూడా గుహదగ్గరకు తీసుకొనివెళ్ళకతప్పలేదు.
ముసుగుమనుష్యులవెంట వచ్చిన మాగనాడు ఆశవాన్ని తీసు
కొనిపోవటంలో సహకరించకుండా దూరాన వుండిపోయాడు.
ముసుగుమనుష్యులు ఆశవాన్ని ఎత్తుకొని తీసుకొనిపోతుండగా
ఆ శవంమీదనుండి ఒకరకమైన పరిమళం బయలుదేరింది. ఆ
వాసనతో వాళ్ళు స్పృహతప్పి పడిపోయారు. ఆ వెంటనే శవా
కారంలోవున్న ఆ స్త్రీ లేచికూర్చున్నది. అప్పటికి మాగ
వాడుకూడా దగ్గరకు వచ్చాడు.

మాగ:- అమ్మయ్య! మనపని పూర్తిఅయింది. భూత
నాథుడు సామాన్యమైన వ్యక్తికాడని వీళ్ళకిక తెలియగలదు.

ఆమె:- ముసుగుమనుష్యులు నీపైన ఎక్కడ అనుమా
నిస్తారో నీ వాలోచించావా?

మాగ:- అన్నీ ఆలోచించాను. వాళ్ళకు నేనేమాత్రం
అనుమానం కలుగనీయను. వాళ్ళిద్దరిలో ఒకణ్ణి అపహరించి
నా పని పూర్తిచేసుకొంటాను. - అని ఆముసుగు మనుష్యుల
ముఖానగల ముసుగులను తొలగించాడు. బయల్పడిన రూపా
లను తొలగించి ఆశ్చర్యచకితుడై ఆమెతో "అరే! వీళ్లు రాజ
సభకువచ్చే ముసుగుమనుష్యులే!" అన్నాడు.

అప్పటికి శవాకారంలో చెయ్యి తెగిపడివున్న స్త్రీ కూడా సంసిద్ధురాలై వెనుకకు మెలిపెట్టికట్టిన తన చేతిని యథాస్థానంలోకి తెచ్చుకొన్నది. నిజానికి ఆ ముసుగువాడు భూతనాథుడూ, ఆ స్త్రీ వేషం ధరించిన యిద్దరూ అతని అనుచరులు.

ఒక స్త్రీ వేషం:- అయితే వీళ్ళిద్దరేనా రాజసభకు వస్తూవుండేవాళ్ళు.

భూత:- రాజసభలో ముసుగుమనుష్యులు రెండుసార్లు తమ ముఖాలను చూపించినప్పుడు నేను ఈ ఆకారాలనే చూచాను. కాని వీళ్ళుమాత్రం ఆ మనుష్యులు కారు. ఈ వేషాలలో అక్కడికి వచ్చివుంటారు. ఇప్పుడు వీళ్ళిద్దరినీ నే నెత్తుకొనిపోయి అసలు రహస్యాన్ని తెలుసుకొంటాను.

ముగ్గురూ ఆ ముసుగుమనుష్యుల నిద్దరినీ మూటలుగా కట్టుకొని తీసుకుపోయారు.

# 11

ముసుగు మనుష్యులు వెళ్ళిపోయిన తరువాత వీరేంసింహుడు తన తండ్రితో తారాసింహుని వృత్తాంతమంతా చెప్పాడు. దేవీసింహుడు దుప్పటిలో చుట్టివున్న చిత్రపటాన్ని సురేంద్రసింహ మహారాజుకు చూపించాడు.

సురేం:- ఈ చిత్రాన్ని ఎవరో గొప్ప కళాకారుడే చిత్రించాడు. తారాసింహా! నీకీ చిత్రం ఎక్కడ దొరికింది?

తారా:- ఈ చిత్రపటాన్ని గురించి సంపూర్ణంగా తెలుసుకోటానికి ఇంకా కొన్ని రహస్యాలు బయటపడవలసి

వున్నాయి. ఆ రహస్యాలు తెలుసుకోనే ప్రయత్నంలోనే నేనున్నాను.

తేజ:— ఇప్పుడా రహస్యాలు బయటపడ్డాయా ?

తారా:— పూర్తిగా తెలియటంలేదు, కొద్దిగా తెలిసింది.

తేజ:— ఈ కార్యక్రమములో నీవు నీ అనుచరుల సహాయ మెందుకు తీసుకోలేదు.

తారా:— ఇంతవరకూ అలాటి అవసరం కలుగలేదు. ఇకమీదట నాకా సహాయం కావాలి.

వీరే:— మరి నీకీ పటం ఎలా లభించింది?

తారా:— భూతనాథుని భార్యద్వారా.

దేవి:— ఆమె నీకెక్కడ కలిసింది?

తారా:— మీరూ, భూతనాథుడూ ఆమెను చూచిన అడవిలోనే మీరు ఆమెవెంట ఒక పూరిగుడిసెలోనికి వెళ్ళారు కూడా.

దేవి:— అయితే నిజంగానే ఆమె భూతనాథుని భార్య అవునా ?

తార:— అవునండి.

దేవి: మేము ముసుగు మనుష్యులయింట్లో చూచిన స్త్రీ లిద్దరెవరో చెప్పగలవా?

తారా:— ఆ ఇద్దరిలో ఒకతె భూతనాథుని భార్య. రెండవస్త్రీ సంగతి యింకా తెలియలేదు.

దేవి:— ఆ రెండవస్త్రీ నీ తల్లి కాదా?

తారా:— కావచ్చు, కాని నా కింకా నమ్మకం కలుగలేదు.

దేవి:- ఆమె భూతనాధుని భార్య అని నీ కెట్లా నమ్మకం కలిగింది?

తారా:- స్వయంగా ఆమె చెప్పింది

దేవి:- ఈ సంగతులన్నీ అసలు నీ కెట్లా తెలుసు?

తారా:- ఆ సమయంలో నే నక్కడ వున్నాను. నన్ను సాయంత్రకాలం భూతనాథుడు ఆ ముసుగు మనుష్యుల వద్దనే బంధించాడు కూడా.

వీరే:- అయితే భూతనాథుడు చాలా చెడ్డపనే చేశాడు కాని ఆ ముసుగు మనుష్యులు ఈ వేళ ఇక్కడికి వచ్చారుగదా!

తారా:- భూతనాధుడు బంధించిన ఆరోజులలో మనకు ముఖాలు చూపించిన ముసుగుమనుష్యులను వద్దనే అని మాత్రం గట్టిగా చెప్పగలను.

తేజ:- అతను వాళ్ళ నెక్కడ బంధించాడు?

తారా:- గుహా ముఖద్వారంవద్ద.

దేవీ:- బహుశః మావలెనే నీవూ ముసుగుమనుష్యుల వెంటపడ్డావనుకొంటాను.

తార:- నాకథ చాలా విచిత్రమైంది. నేను ఒక వారం రోజులనుండీ ఆ ముసుగుమనుష్యుల వలలో చిక్కుకొన్నాను. ఒక గంట ఆగిన తరువాత నా కథ చెప్పటానికి అవకాశ మివ్వండి.

జీత:- ఈ మధ్యలో యేంచేస్తావు?

తార:- మా అమ్మను కలుసుకోవాలి.

తేజ:- నీ సంగతి సందర్భాలు ముసుగుమనుష్యులకు తెలుసునా?

తారా:- వాళ్ళసంగతి చాలా విచిత్రంగా ఉన్నదండీ. నన్ను గురించివాళ్ళెట్లా తెలుసుకొన్నారో నాకే తెలియదు.

తేజ:- నిన్నూ భైరవసింహుణ్ణి పంపవలసిందని రాకుమారులు కబురంపించిన సంగతి నీకు తెలుసా?

తారా:- తెలియదు.

తేజసింహుడు రాకుమారుడు వ్రాసిన ఉత్తరాన్ని తారాసింహుని కిచ్చాడు.

తారా:- ఈ ఉత్తరం ముగ్గురు మనుష్యులిచ్చారా?

తేజ:- అవును. వాళ్ళ వెంటనే మీరిద్దరూ వెళ్ళాలి.

తారా:- అలా యిష్టం.

నాటికి సభ ముగిసింది. తారాసింహుడు తిన్నగా తల్లి దగ్గరకు వెళ్ళాడు. ఆమెతో మాట్లాడిన తర్వాత జీతసింహుని వద్దకు వెళ్ళాడు. జీతసింహుడు సురేంద్రసింహుని దగ్గర ఉన్నాడని తెలుసుకొని అక్కడికి చేరాడు. తారాసింహుడు తాను చెప్పదలచుకొన్నది మహారాజుకు మాత్రం చెప్పివేశాడు. ఇతరులకు చెప్పవలసినవసరం లేకుండా రాజాజ్ఞను పొందాడు. అందుకు దేవసింహునికి చాలా బాధ కలిగింది. కాని అతడు కుమారుణ్ణేమీ దండించలేక పోయాడు.

చాలా ప్రొద్దుపోయిన తరువాత సురేంద్రసింహుడు వీరేంద్రసింహుణ్ణీ తేజసింహుణ్ణీ తనవద్దకు పిలిపించాడు. అంతకుముందే అతనివద్ద జీతసింహుడున్నాడు. వాళ్ళు చాలా ప్రొద్దుపోయేవరకూ తారాసింహుణ్ణిగూర్చి చర్చించుకొన్నారు.

ఆ తరవాత ఎవరి గుడారాలలోనికి వారు విశ్రాంతికోసం వెళ్ళారు.

## 12

మరునాడు మామూలు వేళకు ముసుగు మనుష్యులు వచ్చారు.

తేజ:- మీ మనుష్యుల ఇద్దరినీ భూతనాథుడు బంధించాడని తారాసింహుడు చెప్పాడు, నిజమేనా?

ముసుగు:- అవునండీ. అయినా మాకేం ఫరవాలేదు. మా వాళ్ళుకూడా భూతనాథుణ్ని ఏమీ చెయ్యారు. ఇంతేగా భూతనాథునికి వాళ్ళెవరో తెలియదు. తెలిస్తే అతనికే ఆశ్చర్యం కలుగుతుంది. అయినా భూతనాథునికి ఈ పనులన్నీ యెందుకు చెప్పాలి? ఆ బంధించిన యిద్దరి ముఖాలనూ చూచినప్పుడైనా విడిచిపెట్టవలసింది. ఆ ముఖాలను భూతనాథుడు రాజసభలో ఒకసారి చూడనే చూశాడు.

తేజ:- ఏ ముఖాలనుచూచి సాధువు జయపాలుడూ వణకిపోయారో ఆ ముఖాలుగల ముసుగుమనుష్యులనే భూతనాథుడు బంధించాడని విన్నాం. అయితే వాళ్ళు రాజసభలోనికి వచ్చారా; వాళ్ళ వేషాలు మీరు వేసుకొని వచ్చారా?

ముసుగు:- వాళ్ళు రాలేదండి! వాళ్ళ వేషాలు మేము వేసుకొన్నాం.

తేజ:- అయితే వాళ్ళెవరంటావు?

ముసుగు:- రెండుమూడు రోజులాగితే ఆ విషయాన్ని చెబుతాను. ఇప్పుడు మాకు అవసరమైన పనులున్నాయి.

బహుశః వాళ్ళిద్దరూ భూతనాథుడు రేపిక్కడికి రావచ్చు. ఒక వేళ ఒంటరిగావచ్చే వాళ్ళనుకూడా తీసుకురమ్మని ఆజ్ఞాపించండి. సాధువూ ఆయన ఆలులిద్దరినీ కూర్చోబెట్టి ఆ ముసుగు మనుష్యుల సంగతంతా వివరాలు తెలుసుకుంటే నాకు చాలా ఆనందంగా ఉంటుంది. నేనుకూడా కొంచెం ఆగివుంటాను. మీకు తెలియని విషయాలు నేను చెబుతాను. (కొంచెం ఆగి) భైరవసింహుణ్ణీ, తారాసింహుణ్ణి ఇవ్వేళ మీ వెంట వంపుతారా ?

సురే:— ఆ! వాళ్ళిద్దరూ సిద్ధంగానే వున్నారు.

అక్కడేవున్న భైరవసింహుడూ తారాసింహుడూ లేచి ముసుగు మనుష్యులవద్దకు వెళ్ళారు.

ముసుగు:— ఇక మేము వెళ్ళివస్తాము.

సురే:— రాకుమారుల సంగతి చెప్పరూ ?

ముసుగు:— లేదండీ ! ఆలస్యమైతే వాళ్ళిద్దరినీ రాకుమారుల దగ్గరకు చేర్చటం కష్టమౌతుంది.

సురే:— సరేలెండి. రేపు వస్తారుగా.

ముసుగు:— తప్పకుండాను.

తారాసింహుణ్ణీ, భైరవసింహుణ్ణి వెంటపెట్టుకొని ముసుగు మనుష్యులు వెళ్ళిపోయారు.

## 13

ప్రొద్దుకుంకి ఒక గంట అయింది. ఒకానొక పర్వత గుహాంతర్భాగాన పదెనమండ్రుగురు మనుష్యులు కూర్చుండి ఎవరికోసమో చూస్తున్నారు. వాళ్ళ సమీపాన లాంతరు

వెలుగుతోంది. ఆ చోటు చునారగఢపు ఇంద్రజాలానికి ఏడు క్రోసులదూరంలో ఉన్నది. ఆచోటు చాలాభయంకరమైనది. ఎవరూ అక్కడికి రాలేరు. అక్కడ వేలకొలది మనుష్యులు రహస్యంగా దాగుకోటానికి వీలైన గుహలుకూడా వున్నాయి. అటువంటి చోటులో నిర్భయంగా కూర్చున్న ఆమనుష్యులు భూతనాధుని అనుచరులు. భూతనాధునికోసమే వాళ్ళు ఎదురు చూస్తున్నారు.

భూతనాధుడు ముసుగు మనుష్యులతో వచ్చాడు. స్పృహతప్పివున్న ముసుగు మనుష్యులను నేలమీదకు దించి నీళ్ళు తెచ్చి వాళ్ళ ముఖాలు కడిగాడు. వాళ్ళ ముఖాలలో ఏ విధమైన మార్పు రాలేదు. వాళ్ళను మూర్ఛనుండి తెప్పరిల్ల జేశాడు. వాళ్ళు భూతనాధుణ్ణిచూచినవ్వి "మీరేనా మాపనిచేసింది?"

భూత:- అవునండీ! మిమ్మల్ని తెచ్చింది విరోధంవల్ల కాదు.

ముసుగు:- ఆ సంగతి మాకూ తెలుసు. ఇంతకూ మమ్ముల నెందుకు తెచ్చారో?

భూత:- ఆ ఏమీ లేదు. మిమ్ములను రెండుమూడు మాట లడగాలనుకొన్నాను.

ముసుగు:- ఎందుకూ? రెండుమూడు రోజు లాగితే ఎలాగు మేము బయటపడతాము. ఇంతలో నీ వెందుకు త్వరపడ్డావో మాకర్థంకావటంలేదు. అసలు నీవేం అడగదలచుకొన్నావు?

భూత:- నేను మిమ్మల్ని అడిగి తెలుసుకోదలచిన విష యాలు మీరు బయటపడేవరకూ నే నెవరికో చెప్పను.

ముసుగు:- సరే అడుగు.

భూత:- నేనూ దేవీసింహుడూ మీయింటికి వచ్చిన సంగతి మీకు తెలుసా?

ముసుగు:- తెలుసు.

భూత:- అక్కడ నేను చూచిన హరనామసింహుడు నిజంగా నాకుమారుడేనా?

ముసుగు:- అవును. ఏం ?

భూత:- ఏంలేదు. అనుమానం తీర్చుకోటానికడిగాను. అదిసరేగాని నేనూ దేవీసింహుడు అక్కడ చూచింది మా భార్యలనేనా?

ముసుగు:- చంపసంగతి నీకెందుకు ? నీపెండ్లాం సంగతి నీవడిగి తెలుసుకో. అవును. అక్కడఉంది నీ భార్యే, రామదేవి.

సమాధానంవిన్న భూతనాధునికి శరీరం నిలువునా దగ్ధమైనంతభాధ కలిగింది. తనభార్యపేరు రామదేవి అనియితరుల కెవ్వరికీ తెలియదని అతనికి తెలుసు. అటువంటి తనభార్యపేరు ఈ సమయంలో ఒక పరాయివ్యక్తి ఉచ్చరించటంవల్ల అతనికి మరీ కోపంవచ్చింది. అంతేగాక తనకు కనిపించినప్పటికీ తన భార్య మాట్లాడకుండా దూరంవెళ్ళిపోయినందుకుకూడా అతనికి అవమాన మనిపించింది.

ముసుగు:- ఏమయ్యా అడగదలచుకొన్నవి అడిగి వేశావా?

భూత:- ఇంకా అడగాలి.

ము సు:- ఆలోచిస్తావెందుకు? అడుగుమరి.

భూత:- మీదగ్గరకు నాభార్య యెట్లా వచ్చింది? స్వయంగానే వచ్చిందా? లేక బలవంతాన వచ్చిందా?

ము సు:- నీ ప్రశ్నలు పెడదారినబడుతున్నాయి. వానికి సమాధానం లభించదు.

భూత:- ఈమాత్రందానికి ఏమవుతుంది?

ముసుగు:- అయ్యేదీ గియ్యేదీ యేమీ లేకపోయినా అది మాయిష్టం.

భూత:- మీయిష్టమంటే కుదరదు. నా ప్రశ్నలకు మీరు సమాధానాలు యివ్వవలసిందే.

ముసుగు:- బలవంతంచేస్తున్నట్లున్నదే!

భూత:- అవును బలవంతమే. ఇప్పుడు మీరు నా ఆధీనంలో ఉన్న మనుష్యులు.

ముసుగు:- అదాసంగతి? మేము ని అధీనంలో వున్నప్పటికీ నీవు మమ్మేమీ చెయ్యలేవు. అందులోనూ నీ అపరాధ వివరాలన్నిటినీ ప్రతివ్యక్తీకరించే చిత్రాన్ని తయారుచేయగల సమర్ధుణ్ణి నీ వసలేమీ చెయ్యలేవు. ఆనాడు నీవు నిజంగా నీకుమారుణ్ణి చూచి ఉన్నట్లయితే ఆ చిత్రపటాన్నికూడా బహుశః చూచివుంటావు.

ముసుగుమనిసియొక్క— ప్రత్యుత్తరంలో దాగిన రహస్య విషయాలు భూతనాథుణ్ణి వివశుణ్ణి చేశాయి. అతని నింతవరకూ ఉత్సాహభరితుణ్ణిగా చేసిన పరిస్థితులే ఆక్షణంలో భయానకాలుగా పరిణమించాయి. అతడు లేచి అటూ ఇటూ తిరగటం ప్రారంభించాడు. చాలాసేపైన తరువాత తననుతాను

అతి కష్టం మీద సంభాళించుకొని ముసుగుమానిషితో "ఆ చిత్రాన్ని వ్రాసింది నీవేనా ?"

ముసుగు :- అవును.

భూత :- అయితే ఆ చిత్రసహాయంతో నామీద ఫిర్యాదు చేస్తానన్నవాణ్ణికూడా బహుశః నీవే పంపించి ఉండవచ్చు.

ముసుగు :- దానికి సమాధానం లభించదు.

భూత :- అయితే ఆ రహస్యాల నన్నిటినీ రాజసభలో బహిరంగపరచదలచావా ?

ముసుగు :- ఇంతవరకూ అలా చేద్దామనుకోలేదు. కాని యికమీదట అవసరాన్ని బట్టి నడుచుకోవలసి వస్తుంది.

భూత :- ఆ రహస్యాలు నీవుతప్ప మీ బృందంలో ఇంకా ఇతరులకుకూడా తెలుసా ?

ముసుగు :- దానికి సమాధానం చెప్పను.

భూత :- మీరేమిటో బలవంతం చెయ్యాలని చూస్తున్నారు.

ముసుగు :- ఆపని చేసేది నీవే.

భూత :- బలవంతం చెయ్యదలచితే నేనిప్పటికైనా ఆపని చెయ్యగలను. మిమ్మల్ని ఎవ్వరు ఎత్తుకొనిపోయారో ఎవరికీ తెలియదుగదా ?

ముసుగు :- అలాగని నీవనుకొంటున్నావు.

భూత :- అయితే తెలుసా ?

ఆసమయంలో "అవును. తెలుసు. ఈ రహస్యాన్ని ఎవరూ దాచలేరు" అని వినిపించింది. భూతనాధుడు ఆ శబ్దా

వచ్చిన దిక్కు చూచి తన అనుచరులతో ఆ వ్యక్తిని పట్టుకో వలసిందని చెప్పారు. భూతనాథుని అనుచరులు పరుగుపరుగున ఆ వ్యక్తిని పట్టుకోటానికి వెళ్ళారుకానీ అతడు పట్టుపడకుండా పారిపోయాడు. అప్పుడు ముసుగుమనుష్యులు పరిహాసంగా నవ్వుతూ భూతనాథునితో "ఇక ఇప్పుడు నీవేం చెయ్యాదలచుకున్నావు" అని ప్రశ్నించారు.

భూత :- మిమ్మల్ని నేను తీసుకొని వచ్చినట్లుగా మీ మనుష్యులకు తెలిసింది. ఆవిషయంలో మీరు చాలా జాగ్రత్తగనే ఉన్నారు. అయినా మాయాజాలంలో నేను మీకు మించిన చేతినే.

ముసుగు :- ఆ సంగతి వేఱు. నీవు నిజంగా మాకంటే మించిన ఇంద్రజాలికుడివి. అయినప్పటికీ రాత్రింబగళ్ళు నీవు మమ్మల్ని నీ అధీనంలోకి తీసుకొని రావాలని విపరీతప్రయత్నాలు చేసికూడా లాభంపొందలేకపోతున్నావు. కనుక ఇప్పటికైనా నీవు మమ్ములని వెంటాడటం విరమించి కొన్నాళ్ళపాటు ఓపికపట్టు. అప్పుడు మేమెవరమో మాఅంతటకు మేమేబయట పడతాం. లేకపోతే నీవే చేతులారా నీపరిస్థితుల నన్నిటినీ చెడగొట్టుకొన్నవాడవౌతావు. ఇంతకూ మేము నీవతకుంవారమే నని మరొకసారి ఉద్ఘాటిస్తున్నాము. నీ నేరాలనన్నిటినీ కప్పిపుచ్చుతాము. మహారాజు నిన్ను క్షమించి తనవాణ్ణిగా చేసుకొనేటట్లుచేస్తాం. అయినప్పుడు అనవసరంగా నీవు మమ్ములనెందుకు రెచ్చగొడతావు?

భూత :- అబ్బే. మిమ్మలను రెచ్చగొట్టాలనే ఉద్దేశం నాకే కోశానాలేదు. మనస్సులో ఏదో దురుద్దేశం పెట్టుకొని

మిమ్మల్ని వెంటాడలేదు. మీరు నాకు సహాయ పడతారనే విషయంలోకూడా నాకేమాత్రం సందేహంలేదు. కాని మీ యింట్లో నా భార్యను చూచిన క్షణంనుంచి నా మనస్సు పరిపరివిధాలుగా ఆందోళన చెందసాగింది. ఇవ్వేళ మిమ్మల్ని నేనిక్కడకు తీసుకొనివచ్చింది కేవలం నా భార్యయొక్క సంగతులు తెలుసుకొందామనే.

ముసుగు :- ఏది ఏమైనా నీవు మమ్మల్ని ఏమీ చెయ్యలేవు. మా వాళ్ళందరికీ నీ రహస్యాలు తెలుసు. అయి నప్పటికీ మాలో ఎవరమూ నీకు నష్టాన్ని కల్పించదలచలేదు. ఇంతగా ఇప్పుడు నీవు మమ్మల్ని అనవసరంగా కష్టపెట్టినప్పటికీ కూడా మేము నీపై పగ సాధించదలచుకోవటంలేదు.

భూత :- ఇప్పుడు నేను మీకేం నష్టం కలిగించాను ?

ముసుగు :- దానికి మేము సమాధానం చెప్పాలని ప్రయత్నిస్తే మమ్మల్ని నీవు గుర్తుపట్టివేస్తావు.

భూత :- అయితే మాత్రమేం ? మీరు స్వయంగా మీ రహస్యాలు బైటపెట్టనంతవరకు నేను మీ సంగతులు ఇతరులెవ్వరికీ చెప్పనని ఒట్టు వేసుకొంటున్నానుగదా ?

ముసుగు :- మా సమాధానం విన్నమీదట నీకు కోపం వచ్చి మామీదకు కత్తిదూసినా దూయవచ్చు.

భూత :- అబ్బే ! అలాటిదేమీ జరగదు. మిమ్మల్ని నేనిక్కడకు తీసుకొనివచ్చినసంగతి మీవాళ్ళకు తెలిసి ఉన్న ప్పుడు నేను మిమ్మల్ని ఏమిచేసినా ఊరకేపోదనే సంగతి నాకు తెలుసు.

ముసుగు :- అది సరేననుకో! మరి నీవు మా సమా ధానం వినటానికి ధైర్యంగా నిలబడగలవా?

భూత :- ఓ. సిద్ధంగా ఉన్నాను.

ముసుగు :- ఏ పెట్టె తెరవటం జరుగుతుందని నీవు భీతుడవైపోతున్నావో ఆ యిత్తడిపెట్టెలో ఉన్నది మూరక్తమే. దానిని నీవు మా దగ్గరనుంచే ఎత్తుకొనిపోయావు. నా పేరే దిలీప్‌షా.

అటువంటి సమాధానం వినవలసి వస్తుందని భూత నాథుడు కలలోకూడా అనుకోలేదు. అందుచేత అతడు పూర్తిగా ధైర్యాన్ని పోగొట్టుకొన్నాడు. అతడు ఆశ్చర్య కరమైన దృక్కులను ముసుగుమనుష్యులపై ప్రసరింపజేయ సాగాడు.

ముసుగు :- మేము చెప్పిన విషయాలమీద నీకు నమ్మకంలేదా ?

భూత :- లేదు. నీవు దిలీప్‌షావు కానేరవు. నేను దిలీప్‌షానుచూచి ఉండనప్పటికీ అతణ్ణి గుర్తించటంలోమాత్రం పొరపడను. అతడు నన్ను క్షమించి స్నేహితుడుగా చేసు కొంటాడనే నమ్మకమున్నది.

ముసుగు :- అయితే నేను దిలీప్‌షానని నీవు గుర్తించ టానికి ఇంకొక ప్రయత్నం చెయ్యాలన్నమాట. నీవు ఆపని చేసిననాటిరాత్రి కన్ను పొడుచుకున్నా కానరావటంలేదు. ఆకాశం మేఘావృతమై ఉన్నది. క్షణ క్షణానికి ఉరుములూ మెరపులతో వాతావరణం భయానకరూపం దాలుస్తోంది. స్త్రీలు భయావహులై ఉన్నారు. ఆ సమయంలో దగ్గరలో

ఉన్న ఖర్జూరవృక్షం మీద పిడుగు పడింది. నీవు నల్లకంబళి కప్పుకొని మామిడితోపులో దాక్కొని పోయినావు. ఇంకా చెప్పాలంటావా?

భూత :- చాలు ఇక నీ మాటలు వినలేను. అయినా నీవు దిలీప్‌షావు కాదని నా అనుమానం.

ముసుగు :- అయితే ఇంకా చెప్పాలన్నమాట. నీవు ఇంట్లో ప్రవేశించినప్పుడు నా చేతిలో ఉత్తరమున్నది. నేను నీమీదకు కత్తి విసిరాను. ఆ ఉత్తరం నా చేతినుండి క్రిందికి జారిపడింది. అప్పుడు నేను దానిని తీసుకొన్నాను. ఇప్పటి వరకూ అది నా దగ్గరనే ఉన్నది. కావాలంటే చూపిస్తాను కూడా.

భూత :- చాలు. అబ్బా! నీ మాటలు వినలేకుండా ఉన్నాను. నీ మాటలనుబట్టి నీవు దిలీప్‌షావనే నమ్మకం కలుగుతోంది. నాపై దయ చూపించు.

ముసుగు :- ఇంకా నమ్మకం లేకపోతే చెప్పు. నీవు వినలేకపోతే నా అనుచరుడికైనా చెబుతాను. (అనుచరునితో) ఆ సమయంలో నేను నా మంచందగ్గర కూర్చుండి యేదో వ్రాసుకొంటున్నాను. అప్పుడు భూతనాథుడు వచ్చాడు. అతడు కప్పుకున్న గొంగళి తొలగిఉన్నది. నా కప్పుడు అతని బట్టలమీద రక్తపు మరకలు కన్పించాయి. నా వలెనే అప్పుడు అతనిముఖంమీద ముసుగు ఉన్నప్పటికీ నేనతడు భూతనాథుడే అని గుర్తించాను. గుభాలున లేచి అతనిముఖాన ముసుగును తొలగించి భూతనాథుణ్ణి గుర్తించాను. ముఖంమీద కూడా రక్తం చిందిఉన్నది. అప్పుడతడు 'నీవు తప్పుకో! నా పని

నన్ను చెయ్యనీ' అన్నాడు. అప్పటివరకూ అతడు నా దగ్గ కెందుకు వచ్చాడో ఏమి కోరుతున్నాడో నాకు తెలియదు. నేను "నీవేం చెయ్యాలను కొంటున్నావు? నే నిక్కడినుంచీ ఎందుకు తొలగాలి?" అని ప్రశ్నించాను. అప్పుడు అతడు నా మీద ఒక కత్తిదెబ్బ తీశాడు. ఆ సమయంలో అతడు పిచ్చి వాడులాగా కన్పిస్తున్నాడు. అప్పుడితడు ఇతరులను గుర్తించే దశలో లేడు.

భూత :- చాలు! నిజానికి నేనప్పుడు ఇతరులను గుర్తించే దశలో లేను. పూర్తిగా అంధుణ్ని.

ముసుగు:- అవునవును. ఆసమయంలో నీవు నీ కొడుకును కూడా గుర్తించలేక పోయావు. ధనాశచే మాయారాణి యొక్క ఇంద్రజాల ప్రధాన సంరక్షకుడైన సాధువు చేతిలోని కీలుబొమ్మగా తయారయ్యావు. (అనుచరునితో) ఆ సమయంలో ఇతనిభార్య ఇతనిని అసహ్యించుకొని నా యింటికివచ్చి దాగుకొన్నది. నేను దగ్గఱగా కూర్చొండి వ్రాసుకుంటున్న మంచంమీద ఇతని చిన్నకొడుకు నిద్రపోతున్నాడు. అతనితల్లి బయటభోజనం చేస్తోంది. ఆమెదగ్గర ఆమె చెల్లెలు కూర్చొండి తన విషాదగాథను చెప్పుకొంటున్నది. బావగారిని అక్కగారి ముందు ఆడిపోసుకొంటోంది కూడా. ఆమె చిన్నారి శిశువు ఆమె ఒడిలోనే ఉన్నది. కాని భూతనాథుడు......

భూతనాథుడు "అబ్బబ్బ! ఆపవయ్యా! ఇకచాలు!" అని స్పృహతప్పి పడిపోయాడు.

# 14

ముసుగు మనుష్యులు భూతనాథునికి స్పృహ తెప్పించారు.

భూత :— మిమ్మల్ని బంధించి తీసుకురావటం పొరబాటే అయింది. నేనిక జీవిస్తానన్న ఆశ నాకేమాత్రం లేదు.

ముసుగు:— నీవలా అనుకోకు భూతనాథా! నీ నేరాలను బహిరంగ పరచాలనే ఉద్దేశం మాకేమాత్రం లేదు. వీరేంద్రసింహ మహారాజు నిన్ను క్షమించేటట్లు కూడా చేస్తామని వాగ్దానం చేశాము. అయినప్పుడు నీ వెందుకు నిరాశ చెందుతావు. లే! ధైర్యం వహించు!

భూత:— నా శత్రువులు నా ప్రత్యక్షంలో వచ్చి నిలబడినప్పుడు నేను క్షమ పొందుతానని అనుకోవటం వట్టి కల్ల. ఒకనాడు నిజంగా వారన్నట్లే చేసిన నేరాలు దాగిఉంటాయనీ యిత్తడిపెట్టె తెలువకుండా నిలబడిపోతుందనీ భావించాను. కాని యికపై నాకట్టివిశ్వాసం ఏమాత్రం లేదు.

ముసుగు:— రాజసభలో మా ప్రవర్తనను చూచికూడా నీవు మమల్ని శత్రువులుగా భావించటం చాలా ఆశ్చర్యంగా ఉన్నది. నాపై నీకు విశ్వాసం కుదరకపోయినట్లయితే ఈ క్షణంలోనే కత్తితీసుకొని నాతల నరుకు! నేను సంసిద్ధంగా ఉన్నాను. అప్పుడు నీకు నీరహస్యాలు బైటపడుతాయనే అనుమానం లవలేశంకూడా ఉండదు.

భూతనాథుడు సంభ్రమాశ్చర్యాలతో ముసుగు మానిసివంక చూచి "దిలీప్‌షా! నిజంగా నీవెంత విశాలహృ

దయుడవయ్యా! నీవన్నట్లు నిజంగా నీవు నా సేనానిని చూపి స్తావా?" అన్నాడు.

ముసుగు:- భూతనాధా! ఇక్కడ ఉన్నవారి అందరి ముందూ ఆయిద్దరి పెద్దమనుష్యుల యెదుటకూడా నీసేనాని పూర్తిగా తెలుస్తాడు. నమ్మండి!

భూత:- ఎవరా పెద్దమనుష్యులు?

ముసుగు:- అపరాధ పరిశోధనాలయంలో అనుభవం మహారాజు దర్బారులోనికి హాజరయ్యే ఆయిద్దరూ ముసుగుమనుష్యులు. !

భూత:- అయితే వాళ్లు మారువేషాలా? మీ ముఖాలను చూచి జయపాలుడు భీతిచెందిననాడు మీరు రాలేదా?

ముసుగు:- అతడు వేరు. ప్రతిపర్యాయమూ అతడీ ముసుగులో ఎన్నో మారువేషాలతో వస్తూఉంటాడు. ఆనాడు అతడు నా వేషంలో దర్బారుకువచ్చాడు.

భూత:- వాళ్ళిద్దరూ ఎవరు?

ముసుగు:- ఆసంగతే నేనిప్పుడు చెప్పలేను. వాళ్ళ నిజ రూపాలు బయటపడిననాడు నీవు వాళ్ళను చూచి చాలా సంతోషిస్తావు. నీవే కాదు మహారాజుతోపాటు రాజసభలో ఉన్నవారు అందరూ ఆనందిస్తారు. ఆ ముసుగు మనుష్యులు అసాధారణ వ్యక్తులు.

భూత:- ఈ నా రహస్యాలు వాళ్ళకుకూడా తెలుసా?

ముసుగు:- నీవు మళ్ళా అదేరకంగా ప్రశ్నిస్తున్నావు.

భూత:- సరే! ఇక అడగను. బహుశః వాళ్ళకీ రహస్యం తెలిసేవుండి వుంటుంది. అయినా నిన్ను చూచి నేనేమీ

భయపడను. అయినా నా కిప్పటికీ నీవు దిలీప్‌షావు కావనే అనిపిస్తోంది !

ముసుగు:- అయితే యింకా నీకు చెప్పాలన్నమాట. పాపం నీ భార్య చాలా వృత్తముగాలు. నీవు మోసం చేసిన...

భూతః:- అబ్బా! అసి వెయ్యవయ్యా నీగొడవ.

"ఇతన్ని నీవు నోరు మూయించగలిగినా నేనావిష యాలన్నిటినీ నీకు స్ఫురణకు తెస్తాను" అంటూ ఆ సమీ పానుండి ఒక వ్యక్తి వచ్చాడు. అతడా సమీపంలో ఎంత సేపటినుండి ఉన్నాడో చెప్పలేము. భూతనాధుడా వ్యక్తిని భయంతో చూడసాగాడు. అది గమనించి ఆ వచ్చినవ్యక్తి కావాలని దీపం ఎదుట తన నిజరూపాన్ని ఇంకా బహిరంగ పరిచాడు.

ఆ వ్యక్తిని భూతనాధుడు ముసుగు మనుష్యులయింట్లో దిడ్డిగంతలోనుండి చూచాడు. అతడే చిత్రపటాన్ని ముసుగు మనుష్యుల యెదుటపెట్టి భూతనాధునిపై ఫిర్యాదుచేస్తూన న్నాడు. ఇప్పుడా వ్యక్తిని ప్రత్యక్షంగా చూచి భూతనాధుడు వణకిపోసాగాడు.

అతడు "ఈ ముసుగుమనిషి నీవు చెప్పినట్లుగా మౌనం వహించినా నేను మాత్రం ఆ సంగతులను నీకు జ్ఞాపకం చెయ్యకుండా వదలిపెట్టను. ఇతడిని నీవు దిలీప్‌షా అని నమ్మకపోతే నన్ను దిలీప్‌షా అని భావించుకో!" అన్నాడు.

భూతః:- అమ్మయ్యో. ఇప్పటికే ఒక దిలీప్‌షా వచ్చి నన్ను నానావస్థలూ పెట్టింది చాలక మళ్ళీ యిలా నీ వొకడివి.

వొచ్చావా? ఇంతకూ మీ యిద్దరిలో ఎవరు దిలీప్ షా యో చెప్పండి.

ముసుగు:- ఎందుకలా భయపడతావు? మా వాళ్ళంతా దిలీప్ షాలమనే చెబుతారు. నీ తెలివినిబట్టి నీవు నిజమైన దిలీప్ షా యెవరో గుర్తించుకో."

భూతం:- ఇంతకూ మీ మాత్రం నిజం చెప్పదలచలే దన్నమాట!

ముసుగు:- ఇంతవరకూ మేము చెప్పినవన్నీ అబద్ధాలేనా?

క్రొత్తవ్యక్తి:- ఇక నేను చెప్పదలచుకొన్నవి అబద్ధాలే విను. ఒకనాటి మధ్యాహ్నవేళ ఆ యిత్తడిపెట్టెను చంకలో దాచుకొని రోషింతగఢం వైపుగా పారిపోతున్నావు. అప్పుడు నీకు దాహం వేసింది! వేపచెట్టు వున్న బావిదగ్గర నీళ్ళు త్రాగాలని ఆగావు. ఆ బావిని ఆనుకొని వున్న ఒక గదిలో ఒక ప్రయాణీకుడు విశ్రాంతి తీసుకొంటూ నిన్ను గురించే ఆలోచిస్తున్నాడు. అతను నిన్ను చూచాడు. నీ మూటలో ఏమున్నదో తెలుసుకోవాలనుకున్నాడు. తనకు సంబంధించిన వస్తువుంటే తీసుకుందామనుకున్నాడు కూడా. అతడప్పుడు పల్లెటూరి బ్రాహ్మణుని వేషంలో ఉన్నాడు. నీవతణ్ని గుర్తించలేవు. అతడొక ఐంద్రజాలికుడు. అప్పుడతడు ఒక చెంబు తీసుకొని నీవు నీళ్ళుతోడుతున్న చోటికి వచ్చాడు. నీవు తల వంచి నీళ్ళు తోడుతున్నావు. నిన్ను వెనుకనుంచి ఒక్క త్రోపు త్రోసి నీ మాయాజాలం సంచిని లాగుకొన్నాడు. అందులో

అతనికి కావలసిన వస్తువు తీసుకున్నాడుగూడా. అతడెవరో నీకిద్దరికైనా తెలిసిందా?

భూత :- లేదు. ఇంతకూ ఈవిషయం చెప్పటంలో నీ ఉద్దేశమేమిటి?

అగసు : ఉద్దేశమేముంది? ఆ వ్యక్తే నీ ఎదుట యిప్పుడు నిలబడ్డాడు.

భూతనాథుడు :- (కత్తిదూసి) "నీవేనా"

అగసుకూడా కత్తిదూసి "అవును. నేనే. ఆనాడు నీ సంచిలో ఏమేమి దాచావో అవన్నీ యిప్పుడు బైటపెట్టి వేస్తాను." అన్నాడు.

మునుగు :- ఆగు! జాగ్రత్త! ఒక్కసారి నీవు చేసిన దుష్టకార్యాలను స్మృతికి తెచ్చుకో! మొదటే చెప్పాను. అనవసరంగా కోపం తెప్పించుకొని నిన్ను నీవే చెడగొట్టుకొంటున్నావని. నిజంగా నీవు అలాగే అయిపోతావు. ఒక చిల్లిగవ్వకూడా పనికిరాకుండా పోతావు. నీవు దిలీప్‌సాను ఏమీ చెయ్యలేవు. అతనికి నీ మెఱపు కత్తి అంటే ఏమీ భయం లేదు.

భూత :- మీరాగండి. ఇతడు నన్ను మోసంచేశాడు. వీడిపై పగ సాధించుకోలేనిదే నే నాగను. ఇతడే నామీద ఫిర్యాదు చేస్తానంటున్నాడు. ఇక్కడే మా యిద్దరి సంగతీ తేలిపోవటం మంచిది.

మునుగు :- కానీ! నీ కత్తిమీద పెద్దమ్మవాడు కూర్చుంటే నేనేం చేస్తాను? పోట్లాడు! దాని ఫలితాన్నికూడా

అనుభవించు! కాని నీవల్లనే మా ఇద్దరికీ కూడా మొగపుకత్తు లున్నాయి. ఈ మొంపుత్రత్తుల తళతళలలో నీ మనుషులు నీకేమీ సహాయపడలేరు.

భూత :- అయితే మీరు ఇతనికి తోడౌతారా ?

మునుగు :- నిస్సందేహంగా ?

భూత :- మీరు నా హితం పరిరక్షిస్తున్నారుగా ?

మునుగు :- నా మనుష్యులకి నష్టం కలిస్తుంటే నే నూరు కుండను.

భూత :- చివరకు మీరందరూ నా కెదురు తిరిగినప్పుడు నే నేం చెయ్యను ?

మునుగు :- ఇతడూ నిన్ను క్షమిస్తాడని ఆశించు. కారణం మీ అందరికీ నా యజమాని దైవశక్తి మీపట్ల ఉన్నందున వుండటమే.

భూతనాధుడు మొరపుకత్తిని ఒడిలో పెట్టి "సరేకా నివ్వండి" అన్నాడు

మునుగు చూసి క్రొత్తగా వచ్చిన నానితో "నే నితనితో పోట్లాడదలచుకొన్నప్పుడు నీవేం చెబుతావులే! కానీ, నేను నీ దగ్గరనే కూర్చుంటాను. మరి నీవిప్పుడు భూతనాధుని వశంలో ఉండిపోదలచావా? లేక వెళ్లిపోతావా?" అని భూతనాధునితో "ఇక నన్నేం చెయ్యమంటావు? మమ్మల్ని ఖైదీలుగా రాజసభకు తీసుకొని వెళ్ళటమే నీకు ఉత్తమం." అన్నాడు.

భూత :- నా దగ్గర అంతశక్తి లేదు. మీరు నన్ను క్షమించారని నాకు విశ్వాసం కలిగితే నేను ఇక్కడినుంచి వెళ్లిపోతాను.

ముసుగు :- అలాగే! కాని యికమీదట నీవు మమ్మల్ని వెంబడించకూడదు.

భూపతి :- అబ్బే! ఇంకా ఎందుకు చేస్తాను? పదండి! మిమ్మల్ని మీ చోటికి పంపించివేస్తాను.

కొత్తమనిషి :- అవసరంలేదు. మేము వెళ్ళగలం.

ఇద్దరు ముసుగుమనుష్యులతోపాటు అతడూ నిష్క్రమించారు.

## 15

సురేంద్రసింహమహారాజు దర్బారులోనికి మరునాడూ ఆయిద్దరు ముసుగుమనుష్యులూ రాలేదు. మూడోనాడు వచ్చారు. తాము గతదినం సభకు రాలేకపోవటానికి కారణం ఒక ముసుగుమనిషి యీ క్రిందివిధంగా ఉదాహరించాడు.

“మహాప్రభూ! భైరవసింహుణ్ణీ తారాసింహుణ్ణీ వెంటపెట్టుకొని మేము రాజకుమారుల దగ్గరకు వెళ్ళుతున్నప్పుడు త్రోవలో మాకు చాలా కష్టాలు ఎదురయ్యాయి. అనారోగ్యంకూడా కలిగింది. అందుచేత ఇంద్రజిత్‌సింహుడు మమ్మల్ని రెండురోజులపాటు విశ్రాంతితీసుకోనిదే వెళ్ళనివ్వలేదు. కనుక మేము నిన్న రాలేకపోయాము. ఇదిగో రాకుమారుడు మీకు వ్రాసిన లేఖ.”

మహారాజు సంతోషపూర్వకంగా ఆలేఖనందుకున్నాడు. ఆలేఖలో —

“పూజ్యులైన తండ్రిగారికి నమస్కారములు.

మీ ఆశీర్వాదాలవల్ల మేము క్షేమంగానే ఉన్నాము. ఇంతవరకూ ఐంద్రజాలికులు లేరనుకొన్నకొరత భైరవసింహుడూ కాళాసింహుడూ వచ్చినతరువాత తీరిపోయింది. రామసింహుడూ, లక్ష్మణసింహుడూ భూతనాథునికి సహాయపడ్డారు. ఐంద్రజాలాన్ని భేదించేపని చాలావరకుచేశాము. బహుశః మూడోనాటికే మేము మీపాదాలవద్ద ఈ సంగతులనే తెలిస్తున్నాము ఇంద్రజాలాన్ని భేదించే మింగతాపని మీదగ్గర వుండే చెయ్యగల్గుతాం. దయచేసి మీరు మేము వచ్చేదాకా ఖైదీలను విచారించేపని ఆపండి. మేముకూడా ఆ విచారణ వినాలని కుతూహలపడుతున్నాము. మింగతా విశేషాలు మీ సమక్షంలోనే తెలియజేస్తాము."

ఒకరితరువాత ఒకరు ఆ వుత్తరాన్ని సంతోషపూర్వకంగా చదువుకున్నారు.

ముసుగు:- భూతనాథుడు వచ్చాడా ?

తేజ:- అదే ఆశ్చర్యంగా వున్నది. అతడింతవరకూ రాలేదు. బహుశః మీ అనుచరులతన్ని...

ముసుగు:- అబ్బె! మావాళ్ళటువంటిపని చెయ్యరు. భూతనాథుడు వచ్చాడనే అనుకొంటున్నాను నేను భూతనాథునిచేత బంధితులయిన ముసుగుమనుష్యులు యిద్దరూ విడుదలైవచ్చారు. అతడు బహుశః మళ్ళా మావాళ్ళనెవరినైనా పట్టుకోవాలని చూస్తున్నాడో ఏమో ?

తేజ:- మీవాళ్ళు తిరిగివచ్చి తమసంగతులు మీకు చెప్పారనుకొంటాను.

ముసుగు:- చెప్పారు. తమను బంధించటంవల్ల భూత నాథుడే చాలా పశ్చాత్తాపపడవలసివచ్చిందట.

తేజ:- ఏం జరిగిందో! మీరు చెప్పవచ్చునా?

ముసుగు:- చెప్పటానికేమున్నది. కాని, భూతనాథుడు అందుకిష్టపడడు. మీ వాళ్ళు భూతనాథుని పాత నేరాలన్నిటినీ బయటపెట్టేసరికి అతడు వాళ్ళనేమీ చెయ్యలేకపోయాడట. వాళ్ళనిద్దరినీ మేమిప్పుడు భూతనాథుడువచ్చాడేమోనని వెంట తీసుకొనివచ్చాను.

తేజ:- అలాగా! ఏరీ వాళ్ళిద్దరూ?

ముసుగు:- బయట ఉన్నారు. ఎవరినైనా పంపి పిలిపించండి.

రాజభటుడు వారిని తీసుకొని రావటానికి వెళ్ళాడు. ఆ సమయంలోనే భూతనాథుడుకూడా వచ్చాడు. అతడందరికీ నమస్కరించి దేవీసింహుని ప్రక్కగా కూర్చున్నాడు. దర్బారులో ప్రవేశిస్తూ అతడు బయట ఆ ముసుగు మనుష్యులిద్దరూ వుండటంచూచి తెల్లముఖం వేశాడు. లోపలకువచ్చిన తరువాత మామూలుగా వచ్చే ముసుగు మనుష్యుల నిద్దరినీ కూడా చూచాడు.

ముసుగు:- బాగున్నావా భూతనాథా!

భూత:- మీ దయవల్ల బాగానేఉన్నాను. కాని చేసిన పాపాలను దేవుడంతటివాడే క్షమించగలిగితే ఈ మానవ మాత్రులు ఎందుకు క్షమించలేక పోతున్నారో అని విచారంగా ఉన్నది.

మునుగు:- ఎవడు ఆ నిర్గుణ పరబ్రహ్మను హృదయ పూర్వకంగా విశ్వసిస్తాడో అతడు ఆ పరబ్రహ్మ నిర్దేశించి నట్లుగా జీవితయాత్ర కొనసాగించుకొంటూ పోతాడు. నిజంగా నీవు హృదయపూర్వకంగా ఆ పరాత్పరుణ్ణి క్షమాభిక్ష వేడుకొని పవిత్రజీవితాన్ని గడవ దలచితే ఆ నిర్గుణబ్రహ్మ నీ కేవిధమైనటువంటి దుఃఖాన్నీ కలుగనీయడు. ఒకవేళ ఇంకా నీకీ జీవనయానంలో అప్పుడప్పుడు దుఃఖదాయక సంఘటనలు ఎదురౌతున్నాయంటే నీ హృదయం ఇంకా నిష్కల్మషం కాలేదన్నమాట. కల్మషాన్ని నీ హృదయంలో ఒక మూల దాచుకొని నీవు శాంతజీవితంకోసం అర్రులు చాస్తున్నావంటే దానివల్ల యేమీ ప్రయోజన ముండదు. కనుక నీవు నీ మనస్సును సమాధాన పరచుకొని ప్రశాంతంగా ఉండు! అలాగున్నట్లయితే నీ కే విధమైనటువంటి దుఃఖమూ కలుగదు.

భూత:- నిజంగా నాకు మీరు చాలా చక్కని తత్వబోధ చేశారు.

దేవీ:- భూతనాథా! రెండు మూడురోజులలో ఇక్కడకు రాకుమారులు రాబోతున్నారు.

"ఎట్లా తెలుసు?"

"ఉత్తరం వచ్చింది"

"ఎవరు తెచ్చారు?"

"ఈ మునుగుమనుష్యులు"

"ఆ ఉత్తరాన్ని నేను చూడవచ్చునా?"

"తప్పకుండాను" అని దేవీసింహుడు ఇంద్రజీత సింహుడు వ్రాసిన ఉత్తరాన్ని భూతనాథుని చేతికిచ్చాడు. భూత

సాధు డా ఉత్తరం చదువుకొని "అమ్మయ్య! ఇక అన్ని చిక్కులూ తొలగిపోతాయి." అన్నాడు. "భూతనాథా! మహా రాజుగారిని తలచుకొని ఇక నీవేమి భయపడ నవసరంలేదు. మహారాజు నీనేరాలను వెలికితియ్య నవసరంలేకుండా ఆజ్ఞా పించాడు. మహారాజుగారి అవయవాలలో ఒకడుగా మెలగు తున్న దేవీసింహుడు నిన్ను సోదరునిగా భావిస్తున్నాడు. ఇంతకీ నీవు తిరిగి రావటానికి ఎందుకింత ఆలస్యమైందో చెప్పు. నీవు బంధించిన ముసుగుమనుష్యులు రెండురోజులక్రిందటే విడుదలై యింటికి చేరుకొన్నారట."

అప్పుడు ఆయిద్దరు ముసుగుమనుష్యులూవచ్చి కూర్చు న్నారు. వారిని భూతనాథుడు క్రేగంట్తిచూస్తూ "బహుశః నేను బంధించిన ముసుగుమనుష్యులు వీరే ననుకుంటాను." అన్నాడు.

ముసుగు:- అవును! మమ్మల్ని తీసుకపోయి నీవేం చేశావో బహుశః మహారాజుగారికి తెలియదనుకొంటాను.

భూత:- మేముందఱమూ ఒకేసారి మాయిండ్లకు బయలుదేరాము. కాని త్రోవలో నాకో విచిత్ర సంఘటన ఎదురైంది.

జీత:- ఏమిటది ?

భూత:- చెప్పటానికి సిగ్గుగా ఉన్నది.

దేవీ:- ఇంద్రజాలికుడన్న వాడికి సిగ్గెందుకోయ్. అందులో ఇక్కడ క్రొత్తవాళ్ళెవరూ లేరుగదా? ఇక ఈ

ముసుగు మనుష్యులను గూర్చి యువరాజు వ్రాసిన దేమిటో నీవు చదివే ఉన్నావుగదా?

భూత :- సరే! చెబుతాను వినండి! నేనక్కడినుండి బయలుదేరినప్పుడు అర్ధరాత్రి గడచింది. ఇక్కడికి రమారమి రెండుక్రోసుల దూరములో ఉన్న రావిచెట్ల అడవిలోనికి చేరుకొన్నప్పుడు నాకొక మధురధ్వని చెవినిపడింది. నలుదిక్కులూ కలయచూచాను. కుడివైపునుంచి ఆ శబ్దం వస్తున్నట్లు తెలిసింది. అటే వెళ్ళాను. ఆ శబ్దం ఎక్కడో విన్నట్లుగానే నాకు స్ఫురించింది. ఉత్సాహంతో మరింత త్వరగా ముందుకుసాగాను. అక్కడ ఇద్దరు స్త్రీలు యుగళగీతికను ఆలాపిస్తున్నారు. వారిద్దరిలో ఒకతె కంఠం నాకు పరిచితమైనదే. నేనక్కడికి వెళ్ళాను. అక్కడ ఒక మర్రిచెట్టుమీద ఇంకా చాలామంది ఆడవాళ్ళున్నట్లు కన్పించింది. మసకమసకగా ఉండటంవల్ల నేనెవరినీ గుర్తించలేకపోయాను.

మర్రిచెట్టుక్రింద నిలబడి మెరుపుకత్తి పిడి ఒత్తి వెలుతురు చేశాను. ఆ వెలుతురులో అందరూ స్పష్టంగా కన్పించారు. నేను వాళ్ళను గుర్తించాలని ప్రయత్నిస్తున్న సమయంలో ఆ చెట్టుకు వలయాకారంగా అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లి ఆ వెనువెంటనే ఆరిపోయాయి. ఆ అగ్ని ఆరిపోయిన వెంటనే పొగలు క్రమ్ముకున్నాయి. ఆ పొగలో విషప్రభావమున్నదికాబోలు! నేను స్పృహతప్పి పడిపోయాను. ఆ తరువాత ఏం జరిగిందో తెలియదుగాని తెలివివచ్చిన తరువాత

నేనొక సర్వాలంకార శోభితమైన గదిలో శృంఖలాబద్ధుణ్ణయి ఉన్నట్లు తెలుసుకొన్నాను. ఆ గదిలో చక్కగా దీపాలు వెలుగుతున్నాయి. ఎదురుగా ఉన్న తివాచీమీద చాలామంది స్త్రీలు కూర్చుండి ఉన్నారు. వాళ్ళందరి కంటెనూ ఉన్నతంగా ఉన్న సింహాసనం మీనా యువరాలు కూర్చుండి ఉన్నది. ఆమె యెవరో అని చూచాను నా కన్నులు నేను నమ్మలేక పోయాను. ఆమె నా భార్య.

---

# మాయామయి

## రెండవ అధ్యాయం

### 1

భూతనాథుడు తన వృత్తాంతాన్ని చెబుతూ చెబుతూ కొద్దిసేపాగి గట్టిగా నిట్టూర్చి నమీదట తిరిగి ప్రారంభించాడు.

"నేను ఆవిధంగా బందీనై నా భార్యయెదుట నిలబడి నప్పుడు లజ్జాభయాక్రాంతుణ్ణి అయినాను. ఈవ్యవహారమేమిటా అని విచారించసాగాను. ఆ సమయంలో నా భార్య నన్నా స్థితిలో చూచి కేవలం చిరునవ్వునవ్వటంతప్ప ఇతరమేమీ చెయ్యలేదు. ఆ గదిలో ఉన్న వారికందరికి నాయకురాలుగా కన్పిస్తున్న ఆమె తలంచి ఉన్నట్లయితే నన్ను సింహాసనంమీద కూర్చోబెట్టుకోగలిగేదే. ఈ విషయాలన్నీ నా ఆలోచనల లోనికి వచ్చినప్పుడు నాకు కోపం ముంచుకొని వచ్చింది. కళ్ళెర్రజేసి ఆమెవైపు తిరిగి 'ఏ ఆడదానికోసం నేను అష్ట కష్టాలూ అనుభవించానో ఆ స్త్రీయైన రామదేవివేనా నీవు? ఇప్పుడు నన్ను నీవు నీ యెదుట ఖైదీగా చూస్తున్నావుగదూ? అని అడిగాను.

"అందుకు సమాధానంగా నాభార్య 'అవును. నేనామెనే. నా కొడుకునే నీవొకప్పుడు అత్యంత ప్రతిభాశాలిగా భావించి నేడు నీవు శత్రువుగా భావిస్తున్నావు. ఒకప్పుడు నన్ను

విశ్వాసపాత్రుడైన ఇంద్రజాలికుడుగా భావించి నీవశమయాను. కాని నేడు నీ అసలు రంగు తెలుసుకొని భయంతో నీకు దూరమై పోవాలని చూస్తున్నాను. మనుసుకు మనుష్యుల యింటిలో నీవు నన్ను చూచావు. ఒకనాడు అడవిలో నిన్ను మోసగించిన రామదేవినే నేను. కాని నీవు లామాఘాటిలో విడిచివచ్చిన రామదేవినిమాత్రం కాను.' అన్నది.

"నాకామె మాటలు విచిత్రంగా వినిపించాయి. ఆశ్చర్య చకితుణ్ణయి ఆమెవంక చూడసాగాను. ఆమె మొదట చెప్పిన మాటలవల్ల నా భాగ్యదేవియని నేను నిస్సందేహంగా భావించాను కాని చివరిమాటగా లామాఘాటిలో నేను విడిచివచ్చిన రామదేవిని తాను కాదని చెప్పినప్పుడు నాకు దిక్కుతోచకుండా పోయింది. చివరకు నేనామెను 'లామాఘాటిలో విడిచివచ్చిన రామదేవివి నీవు కానట్లయితే నా భార్యవుకూడా నీవు కాదు.'

ఆమె :- అట్లా అని యెవరు చెపుతున్నారు!

నేను :- ఇంతకుముందు నువ్వేగా చెప్పింది.

ఆమె 'బహుశః నీవు స్వప్నంలో లేనట్లు కన్పిస్తున్నావు' అన్నది. నాకప్పుడు చాలా కోపం వచ్చింది. చేతులకు వేసిన బేడీలను తునాతునకలు చేయాలని ప్రయత్నించాను. ఆమెకూ కోపం వచ్చింది. తన వెంట నేగల దాసీని చూచి సంజ్ఞామాత్రంగా ఏదో ఆదేశమిచ్చింది. ఆ దాసీకన్య లేచివెళ్ళి అక్కడనేకల ఒక ద్రావకపు సీసాను అందుకొన్నది. ఆ ద్రావకాన్ని ఆమె నా ముఖాన జల్లేసరికి నేను మూర్ఛిల్లాను. ఆతరువాత నాకేమీ తెలియదు. తెలివివచ్చిన తర్వాత నేనొక అడవిలో

వున్నట్లు గ్రహించాను. అక్కడ ఎన్నో గంటలపాటు ఆశ్చర్య చకితుణ్ణయి నలుదిక్కులూ కలయజూచాను. ఆ తరువాత ఒక సెలయేటిని చేరి చేతులూ ముఖమూ కడుగుకొని యిటు ప్రయాణమయ్యాను. అందుచేతనే నేనిక్కడికి రావటం ఆలస్యమైంది.”

భూతనాథుని మాటలు అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తాయి. కాని యీ యిద్దరు ముసుగు మనుష్యులు మాత్రం కిలకిలమని నవ్వారు. అందులో ఒకడు భూతనాథునితో “భూతనాథా! నిజంగా నీవు మోసపోయావు. ఆ స్త్రీ నీతో చెప్పినమాటలలో రెండు మూడు మాటలే నిజమైనవి.

భూత:- అలాగా! ఏమిటా నిజమైన మాటలు.

ముసుగు:- ఆ వివరం నేను చెప్పలేను గాని తొందరలోనే నీ కా విషయాల సత్యాసత్యాలు బోధపడగలవు.

భూతనాథుడెంత ప్రార్థించినా ఆ ముసుగు మానిసి వివరమేదీ చెప్పకపోయాడు. ఆ తరువాత ఆ ముసుగు మనుష్యులు సెలవు తీసుకొని వెళ్ళబోతూ “మీరు రెండురోజులు ఓపిక పట్టండి. రాకుమారుల ఎదుటనే రహస్యాలన్నీ బయట పడటం మంచిది. వారికి ఈ రహస్యాలు తెలుసుకోవాలని కుతూహలం ఉంటుంది.” అనిమాత్రం అన్నారు.

## 2

అర్ధరాత్రికంటే ఎక్కువే గడచింది. సురేంద్రసింహ మహారాజు తన గదిలో మంచంమీద శయనించి జీతసింహునితో అతి రహస్యంగా సంభాషిస్తున్నాడు. జీతసింహుడు

మనం అతిత్వరగా భూతనాథుని న్యాయవిచారణ సందర్భంలో ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాం. అతనిశత్రువులు రోజు రోజుకీ పెచ్చుపెరిగిపోవటం జరుగుతున్నది.

ముసుగు:– అవును! అసలు ఈ న్యాయవిచారణ భూతనాథునిదిగా నాకేమి కన్పించటంలేదు. మనం న్యాయ విచారణ చేయవలసింది బలభద్రసింహ వేషధారినిగూర్చి. అతడు మహాపరాధిఅయినకూడా భూతనాథునిపై దోషారోపణలుచేస్తున్నాడు. ఆ యిత్తడిపెట్టితో మనకేమీ అవసరం లేదు. ఇక ఉత్తరాలసంగతి. దానికి భూతనాథుడు సరిఅయిన సమాధానం ఇవ్వగలడు. ఆ లేఖలను అతడు తనచేతితోనే వ్రాసి ఉన్నప్పటికీ తాను నిర్దోషినని వాదించుకోగలడు. నిజానికి అతడు బలభద్రసింహుని మిత్రుడుకాని శత్రువు కాడు.

సురేం:– అబ్బ! ఏమిటో అంతా అగమ్యగోచరంగా ఉన్నది. గోపాలసింహుణ్ణి ఎంత మోసంచెయ్యటం జరిగింది! ఆ విషయం స్మృతిలోనికి వచ్చినప్పుడెల్లా నాశరీరం కోపంతో ఉడికిపోతుంది.

జీత:– అయిపోయినహానినిగురించి మనమిప్పుడు క్రోధ వివశులమయితే లాభమేమున్నది? ఈశ్వరానుగ్రహంవల్ల గోపాలసింహుడు బ్రతికి బయటపడ్డాడు. అతని శత్రువులు ప్రస్తుతం అతనిచేతిలో చిక్కి ఉన్నారు.

సురేం:– అవును! అతని శత్రువులకు గట్టిశిక్ష విధించాలి. గోపాలసింహునికి ద్రోహంచేసిన ఫలితాన్ని వాళ్ళ అనుభవంలోనికి తీసుకొని రావాలి.

అప్పుడు గోపాలసింహుడు అక్కడికి వచ్చాడు. మహారాజు మంచానికి సమీపంలో కూర్చున్నాడు. ముసుగుమనుష్యులను చూచి "మీరెక్కడ ఎంతసేపటినుండి కూర్చున్నారు?" అని ప్రశ్నించాడు. "చాలాసేపటినుండి కూర్చున్నాము" అని వాళ్లు సమాధానం చెప్పారు.

సురే:- పాపం! వీళ్ళు చాలాసేపటినుంచీ ఇక్కడ మా చర్చలలో ఎన్నో సలహాలనిస్తున్నారు.

గోపా:- ఏమిటా సలహాలు?

సురే:- ఏముంటుంది? మన చిరంజీవుల పెండ్లిండ్లను గురించే! భూతనాథుడూ ఖైదీలూ మొదలయినవారి విషయాలూ ఇల్లాంటి అనేక సమస్యలలో సలహాలిస్తున్నారు.

గోపా:- నాకూ ఇప్పుడివే ఆలోచనలు పట్టుకున్నాయి. నిద్రపోనేలేదు. మీరు కబురంపిస్తే ఇటువచ్చాను. (ముసుగుమనుష్యులతో) మీరిప్పుడు మా యింటివాళ్ళయిపోయారు. కనుక ఈ వ్యవహారాలలో మీసలహాకూడా చాలా అవసరం.

సురే:- న్యాయవిచారణ పూర్తికాకముందే జీతసింహుడు చిరంజీవుల పెండ్లిండ్లు చేద్దామంటున్నాడు. ఖైదీలు మనఆనందోత్సవాలనుచూచి ఏడ్చి చావాలంటున్నాడు. అంతేగాక ఖైదీలపక్షాన వున్నవాళ్ళెక్కడైనా దాగుకొనివుంటే వాళ్ళిక లాభంలేదని చేయి కడుగుకోవటంకూడా జరుగుతుందంటున్నాడు.

గోపా:- అవును నావుద్దేశమూ అదే. వివాహాలై పోయిన తరువాత అతిథులందరి సమక్షంలోనే ఖైదీలను యమ-

లోకానికి పంపిస్తే పదులను పీడించిన వసికి ఫలితమేమిటో అందరికు బోధపడుతుంది

సురేం :- (జీవసింహునితో) అయితే మరింకా ఎవరితోనో సంప్రతించవలసిన పనిలేదు. అన్ని ఏర్పాట్లూ త్వరగా ప్రారంభించి ఎక్కడి కెక్కడికి శుభలేఖలు పంపాలో పంపించండి !

జీవ :- చిత్రం! అయితే భూతనాథుణ్ణి గురించి మన మొక నిర్ణయానికి రావాలి.

గోపా :- మనలో ఎవరూ భూతనాథుడు మనకు చేసిన సహాయాన్ని మరవలేరు. ఇక ఉత్తరాలను గురించి మనమేమీ పట్టించుకోవలసింది లేదు.

సురేం :- అవును. నిజంగా అతడు దోషి అయినట్లైతే అతనికి కృష్ణాజినుని రూపంలో నీవు సహాయపడేవాడివి కావు.

గోపాల :- అవును. ఇందిర వ్యవహారం నేను వ్రాసిన ఉత్తరంద్వారా మీరు తెలుసుకునే వుంటారు. మీకు గుర్తున్నదా ?

సురేం:- ఆ! గుర్తున్నది. ఆరోజులలో భూతనాథుడు మీకు చాలా సహాయపడ్డాడు. సాధువృత్తి శత్రువైన భూతనాథుడు మిత్రత్వాన్ని మరచి లక్ష్మీదేవి వ్యవహారంలో బలభద్రసింహులను మోసగించి ఉంటాడంటే మనం నమ్మకూడదు! అసలు ఆ ఉత్తరాలు భూతనాథుడు వ్రాసినవేనా; కాదా? ఆ ఉత్తరాలకట్టలో రఘువరసింహుడు వ్రాసినవీ అతని పేరిట వచ్చినవీ ఈ రెండురకాల ఉత్తరాలూ ఉన్నాయి. ఇదేమిటో అర్థంకావటంలేదు.

గోపా:- అవునండీ. ఈ విషయం చాలా అనుమానాస్పదంగా కనబడుతున్నది. వాస్తవంగా ఆ ఉత్తరాలన్నీ భూతనాథుడు నకలుతీసుకొన్నవి మాత్రమే. సాధువు మిత్రుడైన రఘువరసింహుడు జమీందారింట్లో ఉంటూ ఈ వ్యవహారమంతా నడిపాడు. అతడూ చాలా నాళ్ళు తన పేరును భూతనాథుడుగా వ్రాసుకొంటూ వ్యవహరించేవాడు. భూతనాథుడు వేణీసింహుని రోహతాసులో రఘువరసింహునివద్ద ఉన్నాడని మీరు నా ఉత్తరం ద్వారా తెలుసుకొనే ఉంటారు. ఇతడు అప్పుడు రఘువరసింహుని ఉత్తరాలు తీసుకొని శేఖాసింహుని వద్దకు వెళ్ళుతుండేవాడు. కనుక అతడా ఉత్తరాలన్నిటికీ నకలు తీసుకున్నాడు. ఆ ఉత్తరాలు అవసరం వచ్చినప్పుడు ఉపయోగించాలనుకొన్నాడు. కొన్నిటిని రఘువరసింహుని యింట్లోనుండి దొంగిలించాడు కూడా. భూతనాథుడు చేసిన పొరబాటింతే. ఈ తప్పును అతడింతవరకూ ప్రకటించకుండా ఉండటానికి కారణమేమిటంటే అతనికి ధనాశకూడా కొద్దిగా ఉండిఉంటుంది. అతడు లంచం తీసుకొని సాధువును విడిచి పెట్టటం, కలాలపెట్టి రహస్యాన్ని దాచిఉంచటం కూడా నేరమే. అతడావిధంగా చేసి ఉండకపోయినట్లయితే నాకింత దుర్దశ సంప్రాప్తించి ఉండేదికాదు. ఆ పొరపాట్లవల్లనే నేడు భూతనాథుడు పశ్చాత్తాపపడవలసి వచ్చింది. అయితే అతడు చేసిన నేరాలన్నిటినీ క్షమించటానికి వీలుగా అతడు మనకెంతో సహాయపడ్డాడుకూడా.

సురే:- ఆ కలాలపెట్టెలో ఏమున్నది?

గోపా :- ఆ కలాలపెట్టెను సాధువుయొక్క రహస్య సమితి కార్యాలయంగా మనం భావించవచ్చు. అందులో ఆ సమితిసభ్యుల యొక్క పేర్లూ రహస్యాలూ దాగి ఉన్నాయి. ఇంకా అందులో దామోదరసింహుడు ఇందిర పేరట వ్రాసిన వీలునామా కూడా ఉన్నది.

సురేం :- అలాగా ! ఈ విషయంకూడా నీవు నాకు వ్రాసేఉన్నావు. ఇప్పుడు నాకు గుర్తుస్తోంది; ఆ రోజులలో భూతనాధుడు పేరాశతో చాలా పొరబాట్లు చేశాడు. అతని మూలాననే మీరందరూ అనేక కష్టాలు అనుభవించ వలసి వచ్చింది.

ముసుగు - బహుశః భూతనాధునికి అతని పేరాశవల్ల ఎంత నష్టం కలిగిందో తెలిసిఉండకపోవచ్చు.

సురేం :- ఏది ఏమైనప్పటికి ఆరోజులలో భూతనాధులిద్దరూ ఒక చేతితో సత్కార్యమూ ఇంకొక చేతితో అకార్యమూ చేస్తూవచ్చారని మనం అనుకోవలసి వస్తున్నది.

గోపా :- అవును. అలాగే జరిగింది.

సురేం:- (జీతసింహుని చూచి) భూతనాధుణ్ణి ఇంద్రదేవుణ్ణి ఇక్కడికి పిలిపించి ఒక నిర్ణయానికి రావటం బాగుంటుందనుకొంటాను అన్నాడు.

జీతసింహుడు లేచి భటునితో ఇంద్రదేవ భూతనాధుల నిమిత్తం కబురంపించాడు.

గోపా:- మనం అనుకొన్నట్లుగా భూతనాధుడేమంత అకార్యం చెయ్యలేదు. అతడు సాధువుదగ్గరనుండి ఇరవైవేల వరహాలను లంచంగా తీసుకొని విడిచిపెట్టినప్పటికీ సాధువుతో

ఇంద్రదేవ్ శాస్త్రి, సహాయాన్ని అందిస్తూ, నన్నూ మోసగించ కూడదని ప్రమాణించి తీసుకున్నాడు. కాని సాధువు తన వాగ్దానం ప్రకారం నిలబెట్టలేదు. దీనినిబట్టి భూతనాథునికి కూడా మంథర విషయం తెలియదనే మనం అనుకోవాలి. అతడుకూడా లక్ష్మీదేవి వ్యవహారంలో మోసపోయాడనే నాకనిపిస్తోంది.

సు:- అంతే అయివుండవచ్చు. అయినా నీకీ విషయాలన్నీ యెలా తెలిశాయి?

గోపా:- ఈ విషయాలన్నీ భూతనాథునియొక్క సహోదరుడైన షేర్‌సింహునిద్వారా నాకు తెలిశాయి. షేర్ సింహుడు భూతనాథుణ్ణి చాలా ప్రేమించేవాడు. అయితే రానురాను భూతనాథునియొక్క లంచగొండి వ్యవహారం చూచి అతను విముఖుడైపోయాడు. రోహితగఢానికి దిగ్విజయసింహుడు రాజాగా ఉండి కిశోరిని తనకోటలో బంధించిన రోజులలో షేర్‌సింహుడు తన నౌకరీని విడిచివెళ్ళాడు. ఆరోజులలోనే భూతనాథుడు రహస్యంగా తిరుగుతుండేవాడు, షేర్ సింహుడు ఇంద్రజాల గుహలో మకాం వేసి రహస్యంగా కమలకూ, కమలినికీ సహాయపడుతున్నప్పుడు అదే గుహలోనికి భూతనాథుడు వెళ్ళి షేర్‌సింహుణ్ణి కలుసుకున్నాడు. కాని ధర్మాత్ముడైన షేర్‌సింహునికి భూతనాథుని కలయిక అసహ్యాన్ని కలిగించింది.

ఆ సమయంలో భూతనాథుడూ ఇంద్రదేవుడూ అక్కడికి వచ్చారు.

జీత :- మీరు చాలా తొందరగా వచ్చారే ?

ఇంద్ర:- మేము సమీపంలోనే ఉన్నాం.

జీత :- అలాగా (గోపాలసింహునితో) తర్వాత ఏం జరిగింది ?

గోపాల :- షేర్‌సింహుడు తన మంచితనానికి ఎక్కడ మచ్చ ఏర్పడుతుందోనని భూతనాథుణ్ణి చూడటానికికూడా ఇష్టపడలేదు. నిజానికి అతనికి భూతనాథునితో మళ్ళీ సమావేశం జరుగుతుందన్న ఆశ లేనేలేదు. అతడు మరణించేవుంటా డనికూడా షేర్‌సింహుని విశ్వాసం. అటువంటి సమయంలో భూతనాథుడు కలియటం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడు భూతనాథుణ్ణి "నీముఖం చూపించవద్దు. మరేదేశమైనా పో !" అన్నాడు. కాని భూతనాథుడు అందుకు అంగీకరించలేదు. అతడు వెళ్ళుతూ షేర్‌సింహునితో 'నేను వీరేంద్రసింహ మహారాజు కొలువులో ఇంద్రజాలికోద్యోగం సంపాదించినప్పుడు చూద్దువుగాని' అని వెళ్ళాడు. తర్వాత కమలినిని కలుసుకొని ఆమెకు హృదయపూర్వకంగా సహాకరించాడు. షేర్‌సింహునికి ఆ పని యిష్టంలేకపోయింది. అతడు నాకూ కమలినికీ భయపడుతూనే సహాకరించేవాడు. ఒకసారి షేర్‌సింహుడు నన్ను ఏకాంతంగా కలుసుకొని నన్నుగురించి పనిఉన్న విషయాలన్నీ చెప్పి 'ఈ విషయాలన్నీ నాకు భూతనిద్వారా తెలిశాయి. ఇంకా నేనే రోహితగఢానికి వెళ్ళి కొన్ని తెలుసుకొన్నాను. కాని మా సోదరులిద్దరికీ మిమ్మల్ని మాయారాణి బంధించిన దనే సంగతి తెలియదు. దేవుని దయ వల్ల ఎలాగో బయటపడ్డారు. ఇక మీదట శత్రువులు మిమ్మేమీ చెయ్యలేకుండా

నాకు తెలిసిన విషయాలన్నీ చెప్పాను. ఇక నుంచి నేను ఎవ రికీ ముఖాన్ని చూపించదలచుకోలేదు. నేను చచ్చిపోయాడను కున్న మా తమ్ముడు బయటపడ్డాడు. అతడేం చేస్తాడో నా కేం అరంగాకుండా ఉన్నది. నే నెక్కడికైనా పోతాను. ఏనాటి కైనా భూతనాథుడు తిరిగి మంచి పేరు సంపాదించుకొని వీరేంద్ర సింహ మహారాజుగారి ఇంద్రజాలికుడుగా ఎన్నదగినవాడైతే నాడు నేను బయటపడతాను' అన్నాడు. ఆ తరువాత షేర్ సింహు డేమైనాడో నాకు తెలియదు. అతనిద్వారానే నాకీ సంగతులన్నీ తెలిశాయి.

జీత :— అలాగా. (భూతనాథునితో) భూతనాథా! ఇప్పుడు నీ విషయమే చర్చ జరుగుతోంది. ఇక్కడ ఉన్న వారికందరికీ నీవంటే సదభిప్రాయం ఉన్నది. మహారాజులు కూడా నీపట్ల ప్రసన్నచిత్తులై ఉన్నారు. ఈనాడే నీవు క్షమా పాత్రుడవై మహారాజుల ఇంద్రజాలికుడవుగా ప్రకటన జరిగినా ఆశ్చర్యపడ నవసరంలేదు. కాని నీవు నీ పరిస్థితులను ఏమాత్రం దాచకుండా అడిగినదానికి సమాధానం చెప్పు.

భూతనాథుడు లేచి నమస్కరించి "మీ ఆజ్ఞను శిర సావహిస్తాను. నే నేవిషయాలు దాచను.

జీత :— జమానియాలో బంధితులైన ఇందిరా సర యూలు, ఇప్పుడు ఇక్కడున్న సంగతి నీకు తెలుసుగదా?

భూత : చిత్తం. తెలుసు. నామూలాననే పాపం వాళ్ళు అనేక కష్టాలనుభవించారు. దురదృష్టవశాత్తూ ఆ రోజులలో నేను దురాశకు చిక్కాను. నా కాదురాశ లేకుండా సాధువును విడిచిపెట్టి నట్లయితే ఈ వ్యవహారమంతా జరిగిఉండేదికాదు.

నేను ఆ రోజులలో అటువంటి చేతులలో ప్రాణాలు పెట్టుకొని ఎలా పని చేశానో మీకు తెలుసు. ఆ పనులన్నీ నేను చేసిన ఒక చిన్న తప్పువల్ల ఎందుకూ పనికిరాకుండా పోయాయి. సాధువు తన వాగ్దానానికి విరుద్ధంగా ప్రవర్తిస్తాడని నేను కలలోకూడా అనుకోలేదు.

జీత :- మీ అన్నగారైన షేర్‌సింహుడు ఇప్పుడెక్కడ ఉన్నాడు ?

భూత :- ఆయన ఎక్కడున్నాడో నాకు తెలియదు. ఆయనకూ నేను ఇలా కళంకవిముక్తురాలనై జీవించగలననే ఆశ యేకోశానలేదు. పాపపంకిలమైన నా పూర్వప్రవృత్తి సంపూర్ణంగా అంతరించిననాడే ఆయన నాకు కనిపిస్తాడు.

జీత :- ఆ ఉత్తరాలు నీ చేతితో వ్రాసినవేనా?

భూత:- అవునండీ! నేను వాటికి నకలు తీసుకొన్నాను. అసలు ఉత్తరాలను రఘువరసింహునివద్ద దొంగిలించాను. నిజానికీఉత్తరాలు వ్రాసింది జయపాలవేషంలో ఉన్న రఘువర సింహుడే

జీత:- అయితే నీ కా ఉత్తరాలనుబట్టి లక్ష్మీదేవికీ బలభద్రసింహునికీ ఆపత్తు సంభవిస్తుందని తెలియలేదా ?

భూత:- తెలుసు. కాని జయపాలునిదగ్గర లంచంతీసుకొని అతనిని వదలిపెట్టాను. కాని బలభద్రసింహునికి ఈ ప్రమాదాన్ని గురించి హెచ్చరిక చేశాను. అయితే అతనికి జయపాలుని పేరుమాత్రం చెప్పలేదు లంచం తీసుకొన్నతరువాత జయపాలసింహునితో లక్ష్మీదేవికీ, బలభద్రసింహునికీ ఎటువంటి చెరుపూ చెయ్యకుండా ఉండేటట్లు వాగ్దానం తీసుకొన్నాను.

కాని జయపాలుడు నన్ను మోసగించాడు. బలభద్రసింహుని వ్యవహారంలోకూడా నేను మోసపోయాను. శత్రువులు బలభద్రసింహుణ్ణి ఖైదీగా చేసి నాతో ఆయన మరణించాడని చెప్పారు. లక్ష్మీదేవి వ్యవహారంలోకూడా సాధువు నన్ను మోసగించి ఆమెను నేను గుర్తుపట్టే వీలులేకుండా చేశాడు. చాలారోజులతరువాత నాకు నకిలీ లక్ష్మీదేవిని చూచే అవకాశం చిక్కింది. అప్పుడు నాకు ఏవిధమైన అనుమానమూ కలగలేదు. ఆ రోజులలో కమలినీ, లాడిలీ, ఆమెదగ్గరనే ఉన్నారు. వాళ్ళే అక్కగారివిషయంలో మోసపోయినప్పుడు నాదాకలెందుకు? చాలారోజులతరువాత ఈ ఉత్తరాలకట్ట నా దగ్గరనుండి అపహృతమయినప్పుడు నేను భయపడ్డాను. అప్పుడే నేను ఈ ఉత్తరాలు నన్నొకరోజున దోషిగా ఋజువుచేస్తాయనుకొన్నాను. చివరకు అలాగే జరిగింది. శత్రువులు ఈ ఉత్తరాలను ఖైదులో ఉన్న బలభద్ర సింహునికి చూపించి నా మీద అతనికి అవిశ్వాసాన్ని కలిగించారు. దోషాలన్నీ నా నెత్తినే రుద్దారు. ఆతరువాత కొన్ని సంవత్సరాలు గడిచాయి. అప్పుడు గోపాలసింహుడు మరణించారనే వార్త ప్రచారమైంది. అందరూ ఆ విషయాన్ని నమ్మారు. అప్పుడు నాకు సాధువూ జయపాలసింహుడు చేసిన దుష్టచేష్టలు కొద్ది కొద్దిగా తెలియసాగాయి. కాని నేను 'లాభమేముందిలే!' అనుకొని ఉపేక్షించాను. గోపాలసింహమహారాజే యీ ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్ళిన తరువాత ఇక నేనేం చేసినా మాత్రం యేం ప్రయోజన మనుకొన్నాను. ఇదే నేను చేసిన తప్పు. ఆ తప్పుచేతనే మా అన్నగారు నాకు దూరమైపో

యాడు. ఆ తరువాత వీరేంద్రసింహమహారాజ ప్రతాపాన్ని ఒకవైపున చూస్తూ మరొకవైపున కమలిని ఆ యింటిలోనుండి బైటికి రావటం గమనించిన పిదప నేనూ ధర్మసంరక్షణానికి నిలబడ్డాను. ఏదైనా మంచిపని చేసి కళంకాన్ని తొలగించుకోవాలని ప్రయత్నం చేశాను. ఈమధ్యలో నాకెన్నో కష్టాలు కలిగాయి. నా యజమాని అయిన రణధీరసింహుడుకూడా నేనంటే విముఖుడయ్యాడు. అప్పుడు నేను ఈ ప్రపంచానికి ముఖాన్ని చూపించకుండా దూరమైపోయి భూతనాథుడు చచ్చాడని ప్రపంచానికి చాటాను. ఇలాగే చెప్పాలంటే ఎన్నో విషయాలున్నాయి. మొత్తంమీద నేను చాలా పాపాలు చేశాను. అయినా మహారాజును శరణు వేడుకొంటున్నాను.

జీత:- నీగతజీవితాన్ని గురించి మహారాజుకు సమస్తమూ తెలుసు. ఇందిరను బ్రతికించటానికి నీవు చేసిన పనిని మహారాజెప్పటికీ విస్మరించలేరు. నీవు ఇంద్రదేవునితో మనస్ఫూర్తిగానే స్నేహం చేశావనటంలో మాకేమాత్రం సందేహంలేదు. కాని ఒక్క విషయం మాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

భూత:- ఏమిటది?

జీత :- ఇందిర కొరకు నీవేంచేశావో ఆ పనులన్నీ నీవు బహుశః ఇంద్రదేవునితో చెప్పి ఉంటావు

జీత :- అయితే ఇంద్రదేవుడు సాధువును యెందుకు విడిచిపెట్టాడు? సాధువును శిక్షించవలసింది పోయి గురుసోదరుడనే సంబంధాన్నికూడా ఎందుకు తెగతెంపులు చేసుకోలేదు ?

భూతి :- ఇంద్రదేవునివంటి ధీరపురుషుడు ఈ ప్రపంచంలో ఎక్కడా ఉండడు. ఈయనకు నేను చేసిన ఒక చిన్న సహాయానికి బదులుగా నాకు ఆయన ఒక అసితర సాధ్యమైన సాహాయ్యాన్ని చేశాడు. అందుకు ఇంద్రదేవునిపట్ల నేను సదా కృతజ్ఞుడనై ఉండక తప్పదు. నేను సాధువుదగ్గఱ లంచం తీసుకొని కలాల పెట్టెను విడిచిపెట్టిన సంగతి యింద్రదేవునితో చెప్పినప్పుడు ఆయన కంటినిండా నీళ్ళు నింపుకొని నాతో అన్నాడు గదా! 'అయ్యో భూతనాథుడా! నీవు చాలా తప్పు చేశావు. ఒకనాటికి నీవు దీని ప్రతిఫలాన్ని అనుభవించవలసి వస్తుంది. సరే! జరిగిందేదో జరిగింది. నీవు నా స్నేహితుడివి. అందుచేత నీవుచేసిన పనిని నే నంగీకరించక తప్పదు. సాధువు ఇకమీదట మఱచిపోతాను. నా కుటుంబానికి ఎటువంటి హాని కలిగినా నాకెన్ని కష్టాలుకలిగినా సాధువును గురించి నే నిక తలపోయను. నా కుటుంబాన్ని గురించి ఎవరికీ చెప్పను. ఆ దుర్మార్గుడైన సాధువుతో ఈవిషయాలు ఇంద్రదేవునికి తెలియవని చెప్పు. నేనూ తెలియనట్లుగానే నటిస్తాను.' అన్నాడు. ఇంద్రదేవునిమాటలు నాకు శూలాలుగా తగిలాయి. నేను 'మిత్రుడా వన్నుక్షమించు! నేను చాలా తప్పుచేశాను. సాధువును నే నెన్నటికి విడిచిపెట్టను. ప్రతీకారంచేసి తీరుతాను. అన్నాను. అప్పుడు ఇంద్రదేవుడు నన్ను దగ్గరగా కూర్చుండబెట్టుకొని భూతనాథా! నేను నిన్ను ఉద్రిక్తపరచాలని యేమీ మాట్లాడలేదు. అలా జరగటానికి వీలులేదు. మనమిద్దరం చేయవలసిందేదో చేశాము. చెప్పవలసిందేదో

చెప్పాము. అందుకు వ్యతిరేకంగా ఇప్పుడు మనమిద్దరం ప్రవ ర్తించగూడదు. అన్నాడు.

సురేంద్రసింహుడు సాదరంగా ఇంద్రదేవుని వైపు దృష్టిని సారించి "సెభాష్!" అన్నాడు.

తిరిగి భూతనాథుడు "నే నెన్ని చెప్పినా ఇంద్రదేవుడు నామాట వినలేదు. అనాటినుంచే ఇద్దరు మిత్రులమూ ప్రవంచానికి దూరమైపోయాం. నాకంటేకూడా ఇంద్రదేవుడెన్నో కష్టాలు అనుభవించాడు. అందుచేతనే సాధువు ఇంద్రదేవుని వల్ల సురక్షితుడై యీనాటికీ ఇంద్రదేవుడంటే నిర్భయంగా ఉండగలుగుతున్నాడు.

సురేం :- ఆహా! ఇంద్రదేవుడెంత ఓర్మిని ప్రకటించాడు.

గోపా - మిత్రత్వాన్ని నిర్వహించుకోనటం అంటే ఇదే. భూతనాథుడు ఇంద్రదేవునికి చేసిన సహాయం ఈ ఒక్క మాటతోనే బదులు తీర్చుకోటం జరిగింది.

భూత :- ఇందిర రాకుమారులకు తన జీవిత వృత్తాంతాన్ని తెలియజేసినసంగతి నాకు తెలియదు. ఆ సంగతి నాకు తెలిస్తే బాగానే ఉండేది.

గోపా :- నాకు తెలిసినంతవరకు ఇందిర తన విషయంలో ఎక్కువేమీ చెప్పలేదు. బహుశః ఆమెకు కొన్ని విషయాలు తెలియక విడిచిపెట్టిందికూడా ఆ భాగాలను నేను మహారాజుకు లేఖద్వారా తెలియజేశాను. (జీతసింహునితో,) ఆ ఉత్తరాన్ని భూతనాథుని కిస్తే మంచిది. అతడు ఇందిర యొక్క విషయాన్ని తెలుసుకొంటాడు.

జీతసింహుడు ఆ ఉత్తరాన్ని తెచ్చి భూతనాథుని కిచ్చాడు. భూతనాథుడు ఆ లేఖను చదువుకొని చివరకు "అవును. దాదాపుగా అన్నీ విషయాలూ తెలిశాయి. ఈ ఉత్తరాన్ని బట్టి చూస్తే ఆమె నాకు కనిపించకుండా పోయినసంగతికూడా తెలిసింది. నా కప్పుడు ఇందిర అక్కడ నుంచి యెలా వెళ్ళిపోయిందో తెలియలేదు. నా మనుష్యుల నడిగితే వాళ్ళు 'ఆమె ఎప్పుడు పారిపోయిందో మాకూ తెలియదు. మేమూ కొంచెం నిర్లక్ష్యంగా చూడటం వల్ల ఈపని జరిగి వుండొచ్చు' అన్నారు. నాకు చాలా కోపం వచ్చి వాళ్ళను దండించాను. ఇవ్వేళ నాకు ఆవని చేసింది మాయాప్రసాదని తెలిసింది నేనతణ్ణి స్నేహితుడుగా భావించాను. అతడే నన్ను మోసగించాడు!"

గోపా :- ఇందిరద్వారా ఈ విషయం తెలుసుకొని నేను మాయాప్రసాద్ సాధువు వటుపాతిఅని తెలుసుకొన్నాను. అతణ్ణి నేను ఇంద్రజాలంలో నిర్బంధించి ఉంచాను. సరేకాని, ఇందిరను తీసుకొని వెళ్ళిన తరువాత నీవు తిరిగి జమానియాకు వచ్చినప్పుడేం జరిగింది? సాధు వేమన్నాడు? సరయూ సంగతి ఎందుచేత తెలియలేదు?

భూత :- ఐదుగురిని వెంటపెట్టుకొని జమానియాకు వెళ్ళాను. వాళ్ళూ మాయాజాలం తెలిసినవాళ్ళే. వాళ్ళకు చెప్పవలసిందంతా చెప్పాను. సరయుకోసం నేను సాధువును కలుసుకోవలసే ఉన్నది. కాని అతనిని ఇంటికి వెళ్ళి కలుసుకోవా లనుకోలేదు. అతడు నామీంద కోపంతో ఎప్పుడేం చేస్తాడో అనే అనుమానం ఉన్నది. అందుచేత నేనతని యింటికి వెళ్ళ

లేదు. వెంటనే అతనెక్కడైనా కలుసుకోవాలనుకొన్నాను. అలా సందేహంతో చాలారోజులు గడచిపోయాయి. సాధువు జబ్బుగా ఉన్నాడని ఇల్లుకదలి రావటంలేదనీ తెలిసింది. ఆసంగతి నాకు మాయాప్రసాద్ చెప్పాడు. నేను మాయాప్రసాద్‌తో ఇందిర విషయం చెప్పలేదు. గోపాలసింహునికికూడా చెప్పలేదు. నా మిత్రుడు ఇంద్రదేవుడూ సాధువును ఏమీ చెయ్యనని వాగ్దానం చేసివున్నాడు. గనుక గోపాలసింహునికి నేనేం చెప్పినా సాధువు శత్రువౌతాడు. నేనూ ఆ విషయంలో మౌనం వహించాను. కాని యీ సంగతి మాయాప్రసాదుకూ ఎలా తెలిసిందో నాకు తెలియదు. వాళ్ళు ఇందిర ఎక్కడ ఉన్నదో తెలుసుకొన్నారు. ఒకనాడు మాయాప్రసాదు నాతో గదాధరసింహా! సరయు సాధువుఖైదులోనే జబ్బుతో పడి వున్నది. నీవు సాధువు యింటికి వెళ్ళితే ఆమెను చూడగలుగుతావు. నన్నేమీ అనుమానించకు' అన్నాడు. నేను సాధువు యింట్లోకి వెళ్ళటానికి నిశ్చయించుకొన్నాను. మాయాప్రసాద్ సాధువు పక్షపాతి అని నాకు తెలియదు. ఒకనాటి అర్ధరాత్రి సాధుగృహంలో ప్రవేశించాను. సాధువు అప్పుడు ఒక ఉన్నతాసనంపైన కూర్చొండి ఆలోచిస్తున్నాడు. అతని శరీరంమీద గాయాలుతగిలాయేమో! కట్లు కట్టారు. నన్ను చూచి సాధువు ఉలిక్కి పడ్డాడు. నేను, 'నేను నీ యింట్లో నిర్బంధంపాలుకావటానికి రాలేదు. సరయును చూడటానికి వచ్చాను. ఈ యింట్లో ఆమె ఉన్నదని తెలిసింది. మీరు నన్ను బంధించాలనిచూస్తే బయటవున్న నా మనుష్యులు మిమ్మల్ని సర్వనాశనం చేస్తారు జాగ్రత్త' అన్నాను. సాధువు

నవ్వి 'నాకోసం నీవింత గట్టిప్రయత్నాన్ని ఎందుకు చేశావు? నా దగ్గర నీవంటివాణ్ణి ఎదుర్కొనే శక్తిలేదు. నేనే నిన్ను వెదుక్కుంటూ వచ్చి క్షమాభిక్ష వేడుకోవాలి అనుకొంటు న్నాను. నన్ను క్షమిస్తావనే ఆశ నాకు ఉన్నది, కోపగించుకో బోకు! నేనేం చెయ్యటానికైనా సిద్ధంగా వున్నాను' అన్నాడు.

నేను అతనిదగ్గర కూర్చుండి 'క్షమించటానికేముందిగాని యిక ముందెప్పుడూ తప్పు చెయ్యనని నీవు వాగ్దానం చేసికూడా తప్పుచేశావు అందుకు నాకు చాలా చింతగా ఉన్నది.'

సాధువు — అయిందేదో అయిపోయింది. ఇకముం దేదైనా తప్పుచేస్తే నన్ను కఠినంగా శిక్షించు!

నేను.— సరే! అలాగేకూడా చూస్తాను. కాని యీ తప్పుకు నీవు కొంత జుల్మానా చెల్లించుకోవలసి ఉంటుంది.

సాధువు:— ఇంతకుముందే నాదగ్గర ఏమీ లేకుండా చేశావు. అయినా ఇప్పుడెంత యివ్వమంటావో చెప్పు.

నేను:— రెండువేల వరహాలు.

సాధువు అలమరాలోనుండి వరహాలమూటను తెచ్చి "ఈ వెయ్యి వరహాలనుమాత్రం తీసుకో" అన్నాడు.

నేను:— సరే! ఈ వరహాలు నీకే యిచ్చివేస్తానుగానీ ఏటికి బదులుగా నీ యింట్లోవున్న సరమూను నా కొప్ప గించు.!

సాధువు:— అలాగే ఒప్పగిస్తాను కాని యీ వరహాలను కూడా నువ్వే తీసుకో! లేకపోతే నన్ను నువ్వు క్షమించినట్లుగా భావించుకోలేను.

నేను:- అబ్బే! ప్రమాణపూర్వకంగా నేను నిన్ను క్షమిస్తున్నాను. మనస్ఫూర్తిగానే యీ వరహాలన్నీ తిరిగి యిస్తున్నాను. ఇప్పుడు నాకు సరయూతప్ప మరియేమీ అవసరంలేదు.

మాయిద్దరిమధ్యా చాలాసేపటివరకు యిలా ఏవో సంభాషణలు జరిగాయి. చివరకు సాధువు నేను చెప్పినట్లుగా అంగీకరించి నన్ను చెయ్యిపుచ్చుకొని యింకొక గదివైపు తీసుకొనివెళ్ళుతూ 'నిన్ను సరయూదగ్గరకు తీసుకొని వెళతాను. రా! కాని ఆమె యిప్పుడు చాలా జబ్బుగా వున్నది' అంటూ నన్నొకగదిలోనికి తీసుకొనివెళ్ళాడు. ఆ గదిలో మంచంమీద సరయూ జబ్బుతో పడుకొనివున్నది. ఆమెకు దూరంగా సాధారణమైన ఒక దీపం వెలుగుతోంది. ఆమె పెద్ద జబ్బులోనే ఉన్నది. నోరత్తి మాట్లాడలేకపోయింది. నన్ను చూచి కన్నీరుపెట్టుకొన్నది. నాకూ కళ్ళు చెమ్మగిల్లాయి. నేనామెదగ్గర కూర్చుండి దీనంగా ఆమె ముఖం చూచాను.

నేను :- సరయూ ఏమిటమ్మా యిది?

ఆమె :- (మందస్వరంతో) బాబూ! నాకు చెడ్డరోజులు వచ్చాయి. ఇక నేను బ్రతకను. సాధువు నన్ను బంధించినప్పటికి అతడు నన్నిక్కడ చాలా జాగ్రత్తగానే చూస్తున్నాడు. కాని నన్నెందుకు బంధించాడో మాత్రం చెప్పలేదు. ఏది యేమైనా ఇక నేను చనిపోవటం తథ్యం. నీవు నన్ను తీసుకొని వెళ్ళటానికి వచ్చావని తెలిసింది. నన్నిప్పుడెక్కడికీ కదలించవద్దు. ఇప్పుడు నే నెవరినీ చూడదలచుకోలేదు. నన్ను ఇక్కడనుండి గంగానదిలో పారవేస్తే నేను హాయిగా మర

ణిస్తాను. మీరెవరూ సాధువు నన్నిట్లా చేశాడని శిక్షించవద్దు. ఇతణ్ణి ఏమాత్రం నొప్పించవద్దు. ఇదే నా ఆఖరి ప్రార్థన” అన్నది.

ఆమె అవస్థచూచి నాకు చాలా జాలికలిగింది. నా కప్పుడు ఇంద్రదేవుని కేసుగాని చెప్పి అతడేం చెయ్యమని చెప్పితే అలా చేద్దామని తోచింది. నా ఆలోచన సాధువుకు చెప్ప లేదు. సరయూతో మరునాడు కలుసుకొంటానని చెప్పి అక్కడి నుంచి లేచి వచ్చాను. ఇంద్రదేవునికొక ఉత్తరంవ్రాసి యీ వర్తమానం తెలియజేశాను. మరునాడు ఇంద్రదేవుని వద్దనుంచి సమాధానం వచ్చింది. అందులో.....

“నీ ఉత్తరాన్ని చదువుకొని నేను చాలా కంపించి పోయాను. నావంటి దురదృష్టవంతుడు మరొకడు ఈ ప్రపంచంలో ఉండబోడు. అభాగ్యుడైన అతడే అలా చేస్తే నేనేం చెయ్యగలను! సాధువుపట్ల నేనుచేసిన ప్రతిజ్ఞను జవదాటను. అన్ని కష్టాలనూ నేను సహిస్తాను. సరయునుచూచి సాధువుమనస్సులో అనుమానాన్ని కలిగించ దలచలేదు. ఆమె ఒకవేళ జీవించగలిగితే నా దగ్గరకామెను తెచ్చి చూపించు. ఇంతేసంగతులు” అని ఉన్నది.

ఆ ఉత్తరాన్ని చదువుకొని నేను చాలా దుఃఖించాను. నా రక్షణ యేర్పాట్లు మరింత పటిష్ఠపరచుకొని తిరిగి సాధువు ఇంటికి వెళ్ళాను. సాధువు నన్ను క్రిందటిరోజుకంటే ఎక్కువ గౌరవించాడు. సరయూ పరిస్థితి యింకా విషమించి ఉన్నది. చివరకు నాలుగోనాటి అర్ధరాత్రం ఆమె మరణించింది. అప్పటి నాపరిస్థితిని వర్ణించలేను. ఆమె మృతదేహానికి దహన సంస్కా-

ఇంద్ర:— అవును. అదే జరిగింది. నా భార్య మరణించిం దని తెలుసుకొని నేను చాలా చింతించాను. నా కూతురూ, భార్యా నాకు దక్కకుండాపోయారని కొంత భూతనాథుని వల్లనూ మరికొంత యితరుల వల్లనూ తెలుసుకొని నేను భూత నాథుని కొట్టి విడిచిపెట్టాను. కాని నేను సాధువును క్షమించి ఉన్న కారణంచేత భూతనాథుణ్ని ఏమీ అనలేకపోయాను. అంతేగాక యితను నాకు కొంత ఉపకారంకూడా చేసిఉండటం వల్ల ఏమీ అనలేకపోయాను. కాని భూతనాథుని వైపునుంచి నా మనస్సును మరలించుకొన్నాను. నారహస్యాలేమీ అత నికి చెప్పలేదు. అప్పుడప్పుడూ నాకితడు బైట ఎక్కడైనా కన బడేవాడు. నేనుండే యింద్రజాలంయొక్క మార్గాన్ని ఇతనికి చెప్పలేదు. నా యింటికెప్పుడైనా ఇతడు వస్తే కళ్ళకు గంతలు కట్టి లోనికి రప్పించేవాణ్ని. అందుచేతనే ఇతనికి లక్ష్మీదేవి పరి స్థితి తెలియలేదు. ఇతడు లక్ష్మీదేవి పట్లకూడా ద్రోహం తల పెట్టాడని నేను భావిస్తుండేవాణ్ణి అంతేగాక యితడెన్నో రహ స్యాలు నాకు చెప్పకుండా ఉంటున్నాడని నాకు అనుమానం ఉండేది. అలాగే వాస్తవానికి ఇతడు కొన్ని విషయాలు దాచాడుకూడా.

భూత:— రామరామ! అటువంటిదేమీ లేదు.

ఇంద్ర:— అలాకాకపోతే సాధువుదగ్గరనుండి యిందిరతో పాటు ఆ కలాలపెట్టెను ఎత్తుకొని వచ్చి నాదగ్గఱ పెట్టి చివరకు నాకు తెలియకుండానే ఆ పెట్టె నెందుకు తీసుకు పోయావు?

భూత :- ఏ యింద్రజాలికుడి ఆ పెట్టె అదృశ్యమైంది?

ఇంద్ర : కాశీరాజ్యంలోని యింద్రజాలికుని నన్ను నీవు కలుసుకోవటానికి వచ్చిన రోజునే ఆ పెట్టె పోయింది.

భూత :- కాని, ఆ పెట్టెను దొంగిలించింది నేను కాను. నా కొడుకైన నానక్ అపహరించాడు. ఆ పెట్టె నా వశమైతే నేను నిన్ను అడిగే తీసుకొనేవాణ్ణి. సాధువు ఆజ్ఞానుసారం లాడిలి రామభోళి వేషంలో నానక్‌ను మోసగించి మీదగ్గర నుండి అతను ఆ పెట్టెను దొంగిలించేటట్లు చేసింది.

గోపా :- అవునవును! నేనూ ఆ మాటను అంగీకరిస్తాను. నాకూ ఆ విషయం తెలుసు. నిజంగా ఆ పద్ధతిలోనే ఆ కలాలపెట్టె అక్కడకు చేరింది. చివరకు చాలా కష్టం మీద ఆనాడు నా చేజిక్కింది. అప్పుడు నేను కృష్ణాజినుని వేషంలో రోహితగఢం చేరాను లాడిలి రామభోళి వేషంలో తనను మోసగించిందని నానక్ విశ్వాసం. కాని నిజానికి అలా జరగలేదు. రామ భోళి వేషంలో అతనిని మోసగించిన యువతి వేరొక ఇంద్రజాలికురాలు లాడిలి కేవలం ఒకటి రెండురోజులు మాత్రమే రామభోళి వేషంలో ఉన్నది.

జీత :- ఆ కలాలపెట్టె మీకెక్కడ దొరికింది? సాధువు దానిని చాలా జాగ్రత్తగా భద్రపరచి ఉంచాడుగదా?

గోపా :- జాగ్రత్తగానే భద్రపరచాడుగాని భూతనాథుని సహాయంవల్ల ఆ పెట్టె నాకు తేలికగానే లభించింది. సాధువు తన విచిత్రశాలలో ఆ పెట్టెను దాచాడు. ఆ విచిత్రశాల తాళంచెవి మాయారాణిదగ్గర ఉండేది. భూతనాథుడు రాణిదగ్గరనుంచీ తాళంచెవి తీసుకొని విచిత్రశాలలో దాచిన

ఆ కలాలపెట్టెను నాకిచ్చాడు. ఆ విచిత్రశాలయొక్క రహస్యం నా తండ్రిగారికి ఆ సాధుపుంగవుకూ తప్ప ఇతరులకెవ్వరికీ తెలియదు. నా తండ్రిగారిని సాధుపుంగవుడు విచిత్రశాలకు అధిపతిగా నియమించాడు. భూతనాథుడు తాళంచెవి నాచేతికిచ్చిన తరువాత నేను ఆ విచిత్రశాలయొక్క రహస్యాలన్నిటినీ తెలుసుకొన్నాను.

జీత:— భూతనాథునితో నీకూ నాగర్ మనోరమలకూ గల సంబంధమేమిటి ?"

జీతసింహుని ప్రశ్నకు భూతనాథుడు నిరుత్తరుడై తల వంచాడు. ఆ సమయంలో గోపాలసింహుడు భూతనాథునికి సహాయంగా జీతసింహునితో "ఆ ప్రశ్న వదలివేయండి ! ఆ రోజుల్లో భూతనాథుడు చాలా అవస్థలలో ఉండేవాడు. రోహితగఢపు చీకటిగుహలో వీరేంద్రసింహ మహారాజు భూతనాథునియొక్క నేరాలను క్షమించిన విధంగా కమలనికూడా ఇతని అపరాధాలను అన్నింటినీ క్షమించింది. అంతేగాక ఆ నేరాలను బయటికి పొక్కకుండేటట్లుకూడా చేసింది.

జీత:— సరే అయితే పోనివ్వండి"

గోపా:— భూతనాథుడు కమలనికి సహాయకుడుగా ఉంటూ ఏ యే పనులు చేశాడో వాటిని తలచుకుంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. విపరీత విపత్కర పరిస్థితులలో భూతనాథుడు వహించిన పాత్ర అత్యద్భుతమైనట్టిది. అట్టి భూతనాథుని కడుపున పులికడుపున మేకలాగా నానక్ జన్మించాడు. నానక్ కమలినికి సహకరించకపోగా తన తండ్రికూడా ఏమాత్రం సహాయపడలేకపోయాడు.

భూత:— అవును. ఎన్నోసార్లు నేనతనికి చెప్పిచూచాను కాని...

సురేంద్రసింహుడు గోపాలసింహునితో "విచిత్రశాల అని అద్భుతమైన పేరుపెట్టిన ఆ ప్రదేశంలో ఏమున్నది? నీ కిప్పుడు ఆ ప్రదేశాంగల రహస్యాలన్నీ తెలుసుగదా?" అన్నాడు.

గోపా:— తెలుసు. అక్కడ తాళంచెవి అనే పేరుగల ఒక పుస్తకం ఉన్నది. ఆ పుస్తకాన్ని చదివితే అక్కడి విషయాలన్నీ తెలుస్తాయి. ఆ ప్రదేశం చాలా విచిత్రమైనది. కాని మహారాణి మరణించడంవల్ల ఈనాటికి చాలావరకు శిథిలమైపోయింది. కొద్దిభాగం మాత్రమే మిగిలివున్నది.

జీత:— ఆ పుస్తకంవల్ల రాణికికూడా అక్కడి పరిస్థితులు తెలుసు కాబోలు.

గోపా:— కొద్దికొద్దిగా తెలుసు. ఆ పుస్తకంలో వాడిన భాష ఆమెకు అంతగా తెలియదు. ఆ విచిత్రశాలకూ జమానియా ఇంద్రజాలానికి సంబంధమున్నది. అందుచేత ఇంద్రజీతసింహునికీ ఆనందసింహునికీ నాకంటేకూడా విచిత్రశాలను గురించి యెక్కువగా తెలిసిఉంటుంది.

జీత:— అలాగా. (సురేంద్రునితో) మహారాజా! ఈనాడు మనకు చాలా క్రొత్తవిషయాలు తెలిశాయి. అయినా రాజకుమారులు తిరిగివస్తేనేతప్ప ఇంకా మిగిలిన విషయాలు మనం తెలుసుకోలేము.

సురేం:— అది సరేననుకో! కాని ప్రస్తుతం భూతనాథుని విషయంలో మన మొక నిర్ణయానికి రావలసిఉంటుంది. నాకు

తెలిసినంతవరకు భూతనాథుడు మనపట్ల జాగ్రత్తగానే వ్యవహ రించాడు గాని నేరమేమీ చెయ్యలేదనే తోస్తోంది. అతడేదైనా నేరం చేసివుంటే అది కేవలం ఇంద్రదేవునిపట్లనూ గోపాల సింహునిపట్లనూమాత్రమే చేసివుంటాడు. అయినా అతడు మనతో సంబంధం పెట్టుకొనకరోజులలోనే ఇవ్వేళ ఇంద్ర దేవుడూ గోపాలసింహుడు మనకు ఆప్తవర్గంలో చేరినవారై నారు. కనుక భూతనాథుణ్ణి శిక్షించటమో, క్షమించటమో వాళ్ళిద్దరే చెప్పాలి. వాళ్ళుక్షమిస్తే నేనూ సంతోషంగానే అంగీకరిస్తాను ఈక్షమా దాన వ్యవహారంలో బలభద్రసింహుడు కూడా ఉండాలని కొంతమంది అంటున్నారుగాని నాకా అవసర మేమీ కన్పించటంలేదు. భూతనాథుడే అతన్ని కారాగారంలో నుండి విడిపించాడు. అందుచేత అతనుకూడా భూతనాథునికి కృతజ్ఞత ప్రకటించక తప్పదు.

గోపా:- మేము క్షమించటానికేమీ అభ్యంతరంలేదు. భూతనాథుడు నాకు చాలా సహాయపడ్డాడు. ఆ సహాయాలను తలచుకొంటే భూతనాథుణ్ణి క్షమించకుండా నేనుండలేను.

ఇంద్రదే :- నేనూ భూతనాథుణ్ణి క్షమిస్తాను. దిన దినం తన కళంకాలను ప్రక్షాళనం చేసుకొని సజ్జనుడుగా ప్రవ ర్తించాలని కోరుకొంటున్న భూతనాథునికి భగవంతుడు సహా పడుగాక! కమలిని పుణ్యమా అంటూ ఇవ్వేళ మే మీ శుభ ఘటికలను చూడగలిగాము. ఆమె భూతనాథునిపట్ల అవ్యాజ మైన అనుగ్రహాన్ని ప్రకటిస్తున్నప్పుడు మాదొక లెఖ్ఖా.

జీత :- అవును! అవును!

సురే: నిజంగా అంతే. భూతనాథా! నీ నేరాలన్నింటినీ క్షమించాము. నీవు మా వట్ల అనుసరించిన సత్ప్రవర్తనకు ప్రతిఫలంగా మేము నిన్ను నేటినుంచీ మా ఇంద్రజాలికులలో ఒకనిగా నియమిస్తున్నాము.

సురేంద్రసింహుడు లేచి ఒరనుండి ఒక కత్తిని దూసి భూతనాథునికి బహూకరించాడు. భూతనాథుడు వినతవదనుడై ఆ ఖడ్గాన్ని స్వీకరించాడు. అంతటి మహోపకారం చేసిన మిత్రమండలికి హృదయపూర్వకమైన అభివందనాలు సమర్పించాడు. జీతసింహుడు భూతనాథునికి ఒక మాయాజాలసంచి ప్రత్యేక బహూకృతిగా ఇచ్చాడు. గోపాలసింహుడు రాణీ నుండి తీసుకొన్న ఇంద్రజాలపు పిస్తోలును భూతనాథుని కిచ్చాడు. ఇంద్రదేవుడు భూతనాథుని గట్టిగా కౌగలించుకొని "మిత్రుడా! ఈ సన్యాసి నీకింతకంటే ఎక్కువ ఏమీ బహుమాన మివ్వలేడు. మన పూర్వమైత్రి తిరిగ ప్రారంభమైంది. భవిష్యత్తులో మన మిత్రత్వాని కెటువంటి అవరోధం కలగకుండు గాక అని భగవంతుని ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

భూతనాథుడు సురేంద్రసింహునితో "ఇవ్వాళ నావంటి అదృష్టవంతుడు ఈ భూమండలంలోనే లేడని చెప్పుతాను. దురదృష్టవశాత్తూ అనేక సంవత్సరాలపాటు నేనెన్నో కష్టపరంపరలను సహిస్తూ కొండలూ, గుట్టలూ, అరణ్యాలూ పట్టుకొని తిరిగాను. ఎన్నో అపరాధాలు చేశాను. ఆరోజులలో నాకే మాత్రం సుఖశాంతులు లేకుండాపోయాయి. ఎవరికీ ముఖం చూపించాలని కూడా అనుకోలేదు. కాని ఏ పూర్వపుణ్యఫలంవల్లనో యివ్వాళ నా కష్టాలన్నీ గడచిపోయి మీ అందరి

ముందూ ఇంతగా సన్మానితుడ నయూను. ఇక నాకేం ఫరవా లేదు. ఇప్పటివారు నాతో శత్రుత్వం వహించినవారలు రేపటినుంచీ నాకు మిత్రులుగా మారిపోగలరు. ఇదే ప్రపంచ నియమం. ఆ ఇత్తడి పెట్టెలో మహారాజుగారికి సంబంధించిన యే రహస్యాలూ దాగి లేవని చెబుతున్నాను. అయితే ఆ రహస్యాన్ని నేనేమీ దాచదలచుకోలేదు. కాని ఆ రహస్యం అందరికీ తెలిసిపోవటం నాకిష్టంలేదు. ఆ విషయాలు దేవీసింహునికి చెప్పివున్నాను గనుక అతడే మహారాజుగారికీ ఆ యిత్తడిపెట్టె రహస్యాన్ని తెలియజేయగలడని ఆశిస్తున్నాను.

జీత్ :- దానికేం ఫరవా లేదు. ఇక నీవు వెళ్ళి విశ్రాంతి తీసుకో.

గోపాలసింహుడు "అవునవును. తెల్లవార వస్తోంది. వెళ్ళిపోదాం." అన్నాడు.

అందరూ తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు.

## 3

తూర్పుదిక్కున అరుణోదయరేఖలు క్రమక్రమంగా వ్యాపిస్తున్నాయి. ముసుగుమనుష్యులుకూడా తమ యింటి త్రోవ పట్టారు. భూతనాథుడుమాత్రం తిన్నగా దేవీసింహుని డేరాకి వెళ్ళాడు. దేవీసింహుడు భూతనాథుడిని తనవద్ద కూర్చొబెట్టుకున్నాడు.

దేవి :- ఈ సమయంలో ఎందుకువచ్చావు? ఏమైనా క్రొత్తవిశేషాలున్నానా?

భూత :- అవును. నిజంగా నె త్రొత్తవి శేషాలున్నాయి అవి చాలా సంతోషకరాలు కూడానూ.

దేవీ :- ఏమిటది?

భూత:- మహారాజు ఈనాడు నన్ను తమ కొలువులో ఇంద్రజాలికుడుగా నియమించారు. గౌరవ సూచకంగా ఈ ఖడ్గాన్ని బహుకరించారు. (అని ఆ ఖడ్గాన్ని ఇంకా ఇతర బహుకృతులనూ చూపి) ఈ శుభవార్త మీకు తెలియ జేద్దామని వచ్చాను. నేటికి మీ మిత్రుడు ఇంత గౌరవాన్ని పొందగలిగాడు.

దేవీ:- చాలా సంతోషం ఈ పరిస్థితులలో నీవు నీ పూర్వపు యజమాని అయిన రణధీరసింహుణ్ని కూడా చూచి రావటం మంచిది.

భూత: తప్పకుండా వెళతాను.

దేవీ:- ఇదంతా ఎప్పుడు జరిగింది?

భూత:- ఇంతకుముందే. ఇప్పుడు నేను మహారాజువద్ద నుంచే వస్తున్నాను. (అనెడు ఆనాటిరాత్రి జరిగిన సంగతి సందర్భాలు దేవీసింహునికి తెలియజేశాడు. తెల్లవారిన తరువాత ఉభయులూ స్నానసంధ్యావందనాదులు ముగించుకొన్నారు.)

భూతనాథుడు తన పూర్వపు యజమాని అయిన రణధీరసింహునివద్దకు వెళ్ళాడు. తనను రణధీరసింహుడు గౌరవిస్తాడో లేదో అనే అనుమానం భూతనాథుణ్ని ఒకవైపున బాధిస్తోంది. కాని సంగతులన్నీ తెలుసుకొన్న మీదట రణధీరసింహుడు భూతనాథుణ్ని చాలా గౌరవించాడు.

# 4

జీతసింహుడు రాకుమారుల వివాహానికి చెయ్యవలసిన యేర్పాట్లన్నీ త్వరితగతిని కొనసాగించుకొని పోతున్నాడు. రాకుమారుల వివాహవార్త ప్రజానీకానికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. నేడే రాకుమారులిద్దరూ వచ్చేరోజు. అందరూ వారికోసం యెదురు తెన్నులు చూస్తున్నారు. జీతసింహుడు రణధీరసింహునివద్దకు వెళ్ళి అతడే కిశోరితోపాటు కామినియొక్క కన్యాదానాన్నికూడా చేసేటట్లు ఒప్పించాడు. రాకుమారులు రావటానికి పూర్వమే కిశోరిని, కామినినీ, రణధీరసింహుని డేరాలోనికి పంపించే యేర్పాట్లు చేశాడు. ఆకన్యలనిద్దరినీ జాగ్రత్తగా చూడటానికి కొంత సైన్యంతో పాటు పన్నాలాలూ, రామనారాయణా, చున్నిలాలూ, బదరీనాథుడూ నియుక్తులైనారు.

అనేక సంవత్సరాలనుండి రాజపుత్రుల వియోగభారంలో కృంగి కృశించిపోతున్న రాజకుటుంబం యావత్తూ సంతోషతరంగితమై కోలాహలంగా కన్పిస్తోంది. ప్రజలు గుంపులుగూడి రాకుమారుల రాకను గురించి రకరకాలుగా చర్చించుకొంటున్నారు. సిరుపేదలు తమ పేదరికం తొలగిపోతుందని ఆశపడసాగారు. మధ్యాహ్నానికి ముసుగుమనుష్యులు ఇద్దరుకూడా వచ్చారు. వాళ్ళతోపాటు ఇంకాచాలామంది ముసుగుమనుష్యులు వచ్చారు. ముసుగులచాటునగల వ్యక్తులెవరో తెలుసుకోవాలనే ఉత్కంఠ ప్రజానీకంలో క్షణక్షణానికీ అధికమవుతూవచ్చింది. ముసుగు మనుష్యులద్వారా రాజకు

మారులు ఆ శిలామూర్తిగల వేదికద్వారంగుండా బైటికి
వస్తారని తెలుసుకొని అందరూ అక్కడ గుంపులుగూడారు.

సాయంకాలమౌతున్న సమయంలో ఆ వేదికలోపల
విచిత్రమైన వాద్యధ్వని వినిపించింది. అందరూ అటువైపు
చూడసాగారు. సురేంద్రసింహుడూ మొదలైన పెద్దలు వేదిక
దగ్గర నిలబడివున్నారు. చివరకు వేదిక యెదురుగాగల వాకిలి
తలుపులు భూమిలోనికి దిగబడిపోయాయి. ఆ మార్గంగుండా
ఆనందసింహుడూ, ఇంద్రజీతసింహుడూ బైటికివచ్చి సురేంద్ర
సింహ మహారాజు పాదాలకు ప్రణమిల్లారు. వృద్ధచక్రవర్తి
తన మనుమలను కౌగలించుకొన్నాడు. తరువాత ఆ రాకు
మారులు తండ్రి పాదాలను స్పృశించారు. వరుసగా జీతసిం
హుణ్ణి తేజసింహుణ్ణి గోపాలసింహుణ్ణి కలుసుకొన్నారు. ఆ
పిదప ముసుగు మనుష్యులనూ ఐంద్రజాలిక మిత్రులనూ పరా
మర్శించారు. ఆ యింద్రజాలంయొక్క ప్రధానద్వారం దగ్గర
మంగళతూర్యనాదాలు వినిపించాయి. దాన్నిబట్టి ప్రజానీకం
యావత్తు రాజపుత్రులు వచ్చారని తెలుసుకొన్నారు. అంతః
పురాంతర్భాగంలోగల స్త్రీజనం రాజపుత్రులను కలుసుకొన్న
ప్పుడు వారి ఆనందానికి మేర లేకపోయింది.

ఆతరువాత రాకుమారులు దర్బారులోనికి వచ్చారు.
అక్కడ మంత్రిసామంతాది సమస్త పరివారమూ సమావేశమై
ఉన్నది.

సురేం:- భైరవసింహుడూ, తారాసింహుడు మీదగ్గ
రకు వచ్చారుకదా వాళ్ళనెక్కడ విడిచిపెట్టారు?

ఇంద్రజీత్:— మాకంటె ముందుగానే వాళ్ళిక్కడికి వచ్చారు

సురేం:— ఎక్కడ!

ఇంద్రజీత్:— (ముసుగు మనుష్యులను చూపుతూ) రామసింహ, లక్ష్మణసింహుల కర్తవ్యాన్ని ఈనాడు వాళ్ళిద్దరూ పూర్తిచేశారు.

అప్పుడు ముసుగుమనుష్యులు తమముసుగులను తొలగించారు. వాళ్ళిద్దరూ భైరవసింహుడూ, తారాసింహుడుగా కన్పించారు. అందరూ ఆశ్చర్యంతో ఒకరిముఖాలు మరొకరు చూచుకోసాగారు. భూతనాథునికీ, దేవీసింహునికీ మరీఆశ్చర్యం కలిగింది. వాళ్ళకిద్దరికీ ముసుగుమనుష్యులఇంటికి వెళ్ళిననాటి అనుభవం గుర్తుకువచ్చింది.

సురేం:— భైరవసింహుడూ, తారాసింహుడూ ఇక్కడే వుంటున్నప్పుడుకూడా రామసింహుడూ, లక్ష్మణసింహుడూ ఇక్కడకు వస్తుండేవాళ్ళుగదా! అప్పుడా ముసుగులచాటున ఎవరుండేవారు?

ఇంద్రజీత.— ఎన్నోసార్లు ఈ ముసుగుమనుష్యులందరూ వంతులవంతులుగా వస్తుండేవాళ్ళు. ఒకొక్కసారి మా అన్నదమ్ములిద్దరమూకూడా వస్తుండేవాళ్ళం.

ఇంద్రజీత్సింహుని మాటలు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించాయి. భూతనాథుడూ, దేవీసింహుడూ తమను ఒకప్పుడు బంధించినదెవరో తెలుసుకొని ఆశ్చర్యపడ్డారు. దేవీసింహునికి తనపుత్రుడే యీవిధమైన మోసం చెయ్యటం కొంత కష్టమనిపించింది. అలాగే భూతనాథుడుకూడా సందేహంలోపడ్డాడు.

సురేం:- మీరిద్దరూ ఇక్కడికివచ్చికూడా ఎందుకు రహస్యంగా వుండిపోయారు?

ఇంద్రజీ:- ఇంద్రజాలంయొక్క పని పూర్తికాకుండా నియమానుసారం మేము బయటపడటానికి వీలులేదు. అయితే మేములేకుండానే ఖైదీలను విచారించటం మంచిదికాదనుకొన్నాం. ఇంద్రజాలంలోనికి వెళ్ళినతరువాత ననేక రహస్యాలు తెలిసాయి. ఆ రహస్యాలలో ఈ ముసుగు మనుష్యులందరికీ సంబంధమున్నది.

సురేం:- అయితే వాళ్ళందరినీ ముసుగు తొలగించండని చెప్పు

ఇంద్రజీతుని ఆజ్ఞానుసారం ముసుగు మనుష్యులు తమ ముసుగులను తొలగించారు. వాళ్ళు ఐదుగురున్నారు. ఆ ఐదుగురిలో సాధువూ, బేగమూ దర్బారులో ఒకసారి చూచి భయపడిన ముఖాలు గలవారుకూడా ఉన్నారు. అందరి దృష్టి ఇప్పుడా అయిదుగురి మీదనూ పడ్డది. వాళ్ళను గుర్తించేవాళ్ళక్కడ ఎవరూ లేరు. భూతనాథుడూ, గోపాలసింహుడు మాత్రం వీళ్ళనెక్కడో చూచినట్లుందే అనే అనుమానంతో చూస్తున్నారు.

సురేం:- వీళ్ళెవరో మాకు తెలియటం లేదు.

ఒక ముసుగు మానిసి:- ఖైదీలయెదుటే మా కథ వినటం మంచిది.

ఇంద్ర:- అవును. అలాగే చెయ్యండి. మా సోదరులిద్దరికీ వీళ్ళందరూ ఎవరో తెలిసినప్పటికీ పూర్తిరహస్యాలు మాత్రం

ఇంకా తెలియలేదు. ఆ రహస్యాలు తెలియాలంటే ఖైదీలు హాజరై ఉండటం అవసరం.

సురేంద్రసింహుడు ఒందుకు అంగీకరించాడు. నాటికి సభ చాలించటం జరిగింది.

ఇంద్రజీతునియొక్క మనస్సు కిటికీ చూడాలని ఉబలాటపడుతోంది. అదేప్రకారం కమలినిని ఏకాంతంగా కలుసుకోవాలనికూడా అతడు అభిలాషపడుతున్నాడు. ఇంద్రజీతసింహుడు ఉన్న గదిప్రక్కనే కమలినికూడా విడిదిచేసిఉన్నది. ఆనాటి రాత్రి యింద్రజీతసింహుడు అనేక విధాలుగా ఆలోచించుకొంటూ పడుకొన్న సమయంలో కమలిని ఉన్న గదివైపు వాకిలి తెరచుకొని ఒక దాసి వచ్చింది.

దాసి:— కమలినమ్మ మిమ్మల్ని కలుసుకోవాలనుకొంటోంది. మీరు వస్తారా; ఆమెను రమ్మంటారా?

ఇంద్ర:— ఎక్కడ ఉన్నదామె?

దాసి :- ప్రక్క గదిలోనే.

ఇంద్రజీ :— ఆఁ! నాకు తెలియదే! నేనే వెళతానులే. నీవిక్కడ ఉండు! నీవీ గది తలుపువెయ్యి.

ఆ దాసీ రాజకుమారుని ఆజ్ఞమేరకు అతని గది బయట వాకిలి మూసి తన యజమానురాలి గది దిక్కుగా నడచింది. ఆమె వెనుకనే యువరాజు నడిచాడు. గదిలో అడుగు పెట్టగానే అతని దృష్టి కమలినిపైపడింది. విస్ఫారిత వదనంతో ఆమెను ఆపాదమస్తకం చూడసాగాడు. ఆమె అతని కంటికి ఇదివరకెన్నడూ లేనంత సౌందర్యరాసిగా కన్పిస్తోంది. లోగడ తనకు పరిచయమున్నప్పుడు కమలిని అనేక కష్టాల

కారణంగా ఉదాసీన అయి ఉండేది. ఆ రోజులలో ఆమె రాత్రిం బగళ్ళు మాయరాణిని సాధించాలనే తలంపుతో విశ్రాంతిలేకుండా ఉండేది. అందుచేత ఆమె సుందరతరమైన ఆకృతిలో ఆ రోజులలో అంతగా లావణ్యం కనిపించేది కాదు. నేడా కష్టాలన్నీ తొలగి సుఖమయమైన జీవితం కమలినికి సంప్రాప్తించేసరికి ఆమె సౌందర్యం ఇనుమడించింది. ఆమె చాలా విలువగల దుస్తులను ధరించింది. ఇంద్రజీతసింహుడు ఆ లావణ్యమూర్తిని చూచి సమ్మోహితుడై ఆమెమూర్తిని తన హృదయపీఠంపై ప్రతిష్ఠించుకొన్నాడు.

యువరాజు : కుశలమా ?

ఆమె :- ఇంకా ఎందుకు కుశలంగా ఉండను ? (అతనిని ఆమె ఒక ఉన్నతాసనంమీద కూర్చొబెట్టి) ఇంద్రజాలంలో మీ కేమీ కష్టం కలగలేదుగదా ?

ఇంద్రజీ :- ఈశ్వరకృపవల్ల అంతా సక్రమంగానే జరిగింది. ఈ జరగటాని కంతటికీ కారణం నీవే. నీ సహాయం మాకు లభించకపోయినట్లయితే మేమేమై పోయేవాళ్ళమో! నీవు చేసిన సహాయానికి మేము శాశ్వతంగా ఋణపడిఉంటాం. ఆ ఋణం తీర్చుకోటం ఎలాగూ సాధ్యంకాదు. కనుక నన్నే నీకు సమర్పించుకొంటున్నాను.

కమలిని :- ఆ మాటలన్నీ యిప్పుడెందుకు? మీ నోటి నుండి నా గొప్పతనాన్ని వినటంకోసమే నేను మిమ్మల్ని ఇక్కడికి పిలవనంపా ననుకోవద్దు.

ఇంద్రజీ :- ఒక మాయావి బారినుండి నన్ను సంరక్షించిన నాడే నేను నీవాడనైపోయాను. ఆనాడు నీవు ప్రదర్శించిన

ఖడ్గయుద్ధ నైపుణ్యంకల్ల నీవు ఏవిధంగానూ నాకంటె తక్కువ దానవని తెలుసుకోవటం జరిగింది.

కమలిని:- అదేమిటి? నేను మీకంటె గొప్పదాన్నా! మీరు నన్ను పరిహాస్యం ఆడుకొంటున్నారా యేమిటి?

ఇంద్రజీ :- కాకపోతే ఆనాడు నేను ఓడిపోతానా?

కమలిని :- ఆ మత్తుమందు మిమ్మల్ని వివశులను చేసింది. అందుచేత నేను శత్రువును ఎదిరించవలసి వచ్చింది.

ఇంద్రజీ :- పోనీ! అలాగే అనుకో! అయినా నీవు నన్ను రక్షించావని నిస్సందేహంగా చెప్పకతప్పదు. కేవలం ఆరోజున నేగాక యింకా ఎన్నో సార్లుకూడా నీవు నన్ను రక్షించావు.

కమలిని :- అబ్బా! ఇప్పుడా మాటలన్నీ యెందుకండీ. ఇంతకూ ఇంద్రజాలంలో ఏం చేశారో చెప్పండి.

ఇంద్రజీ :- అన్ని సంగతులూ చెప్తాను. ఇంద్రజాలంలో నన్ను కలుసుకొన్న ముసుగు మనుష్యులను గూర్చి కూడా చెబుతాను. వాళ్ళసంగతి ఇంతవఱకు ఎవరికీ చెప్ప లేదుకూడా. నీవుమాత్రం నీ నోటినుంచి ఎవరికీ నేను చెప్పిన విషయాలు చెప్పవద్దు.

కమలిని :- అలాగే.

ఇంద్రజీతుడు ఇంద్రజాలంలోని సమస్త వృత్తాంతాన్ని వివరించాడు. కమలినికూడా యువరాజుకు తెలియని తారానానక్ భూతనాథాదుల వృత్తాంతాలు చెప్పింది.

ఇంద్రజీ :- ఇవ్వేళ నీ నోటినుంచి చాలా క్రొత్తక్రొత్త విషయాలే విన్నాను.

కమ :- నేనూ అలాగే ఎన్నో గ్రంథవిషయాలు మీ నోటినుంచి విన్నాను ముఖ్యంగా మనుసు మనుష్యులసంగతి నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. మీరా రేవంకి చెప్ప వద్దన్నారుగానీ లేకపోతే నా పతిదేవునికి......

ఇంద్రజీ :- అఁ! ఏమిటీ! నీకు పెండ్లి అయిందా?

కమ :- ఆ చెనువు మహర్నగల గృహంలో మాతో నాకు త్వరగా వివాహమౌతుందని చెప్పారు గదూ?

ఇంద్రజీ:- అవును. చెప్పావు. ఇంతత్వరలో పెండ్లి అవుతుందనుకోలేదు.

కమలిని :- అయితే మీరు నన్ను శాశ్వతంగా కన్య లాగానే చూడదలచు కొన్నారా ?

ఇంద్రజీ :- లేదు. కాని—

కమలిని :- కాని యేమిటీ? చెప్పండీ! ఆగిపోయారేం?

ఇంద్రజీ :- అఁ! ఏమీలేదు. నన్నడిగి ఉన్నట్లయితే.

కమలిని :- ఏమి మాటలండీ! మీరు ఇంద్రాణిని పెండ్లి చేసుకొన్నప్పుడు నన్ను అడిగారా? మిమ్మల్ని నేను అడగ లేదేం?

అని నవ్వింది. రాకుమారుడు సిగ్గుతో తల వంచు కొన్నాడు. అతడు మనస్సులో చాలాబాధకు గురిఅవుతున్నట్లు కన్పిస్తోంది.

ఇంద్ర జీ :- నా జీవితాంతందాకా నేను నీ సుందర మందహాస చంద్రికలలో నిత్యనూతన కాంతులను విలోకిస్తూ యథేచ్ఛగా సరసాలాపాలతో గడపగలనని కలలుకన్నాను.

కమలిని :- నా ఉద్దేశమూ అదే. అందుకే శాశ్వతంగా మిమ్మల్ని విడవకుండా ఉండటానికి వివాహం చేసుకొన్నాను. అదేమిటి? ఏమిటలా పెడముఖం పెట్టారు? ఇటు చూడండి!

ఇంద్రజీ :- వద్దు! వద్దు. పరస్త్రీతో ఏకాంతంగా కూర్చోటం ధర్మవిరుద్ధం. కాని నీ వ్యవహారం చూస్తుంటే నాకు ఆశ్చర్యం కలుగుతోంది. ఎప్పుడూ నీవు ధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించవని నేననుకొంటున్నాను.

కమలిని :- నేను ధర్మవిరుద్ధంగా చేసిన దేమిటో చెప్పండి!

ఇంద్రజీ :- ఏకాంతంగా నన్ను కూర్చోపెట్టుకొని మాట్లాడటం కంటే ధర్మవిరుద్ధం ఇంకొక టేముంటుంది? అన్నిటికంటె మించి శాశ్వతంగా కలిసివుంటానని చెప్పిన నీ మాటలు భారతీయ మహిళ అనదగినమాటలేనా? ఈ విషయాలన్నీ నీ భర్తకు తెలిస్తే నిన్ను ప్రతివ్రతగా అతడు భావిస్తాడనేనా నీ ఉద్దేశం?

కమలిని : ఎందుకు భావించరు? తప్పకుండా నన్ను పతివ్రత అనే అనుకొంటారు. ఒకవేళ వారు అనుమానపడితే ఆ తప్పు వారిదే. కమలిని బొందిలో ప్రాణమున్నంతవరకూ ధర్మవిరుద్ధంగా ప్రవర్తించదనే ఘంటాపథంగా చెబుతాను. మీరు నా ప్రవర్తనను జాగ్రత్తగా గమనించండి. నేను ఇంద్రజాలికను. ఇప్పుడు మావారు ఇక్కడికి వచ్చి నన్ను చూస్తే నామీద ఏమీ అనుమానపడరు.

ఇంద్రజీ :- ఆశ్చర్యంగా వున్నదే!

"కమలిని :- అప్పుడే యేమైంది! ఇంకా ముందు ముందు ఆశ్చర్యపడవలసివస్తుంది." ఇలా అని ఆమె యువరాజును తన వైపుకు లాగుతూ "మీరు ఇలా వివర్ణులవుతారెందుకు?" అన్నది

ఇంద్రజీ:- వద్దు! కమలినీ! వద్దు! నీ విలా చెయ్యటం భావ్యంకాదు. ఈ ప్రపంచంలో ధర్మానికిమించిన వస్తువేముంటుంది? చెప్పు! దానిని కాస్తా అతిక్రమిస్తావా? నీ వప్పుడు కన్యవుకావుకదా! ఒక పురుషుడు నీ మెడలో తాళికట్టిన సంగతి మరచిపోయావా కమలినీ.

కమలిని:- నిజమే! కాని ఒకవేళ నావివాహం మీతోనే జరిగివున్నట్లయితే నేను అనంతసింహునితో ఈవిధంగా ప్రవర్తించేదాన్నా? కాదు.

ఇంద్రజీ:- నీ ప్రవర్తన చూస్తుంటే నీ వీ విధంగానే చేస్తావని నేననుకొంటున్నాను. నీ వ్యవహారమంతా చాలా వేళాకోళంగా వున్నది.

కమలిని:- అవును! అదే వేళాకోళం నేను మీతో చేస్తున్నాను. ఇలా వుండటానికి మావారు నాకు అనుమతి యిచ్చారు. వారు వ్రాసిన ఉత్తరాన్నికూడా మీకు చూపగలను. మనయిద్దరిసంబంధం ఈనాటిదికాదు. తరతరాలనుంచీ వస్తోంది.

ఇంద్రజీ:- అదెట్లా?

కమలిని:- వినండి! నేను చెబుతాను. నేను కిశోరిని నా చెల్లెలుగా భావిస్తున్నాను. అయినప్పుడు మీరు నాకు మరదిగారు కారా?

ఇంద్రజిత్. నా కాసుతో ఇంకా వివాహమే జరుగలేదు కదా ?

కమలిని:- సరే! అది వదలిపెట్టండి! నా భర్త గోపాలసింహుని సోదరులు. గోపాలసింహుని భార్యకు నేను చెల్లెలను. అయితే మీకు నేను మరదలను కానా ?

ఇంద్రజిత్:- అవును! కాని నీ ప్రవర్తనే నాకు విచిత్రంగా కన్పిస్తోంది.

కమలిని:- ఆవిషయం మీరేమంతపట్టించుకోకండి! నేను ధర్మానికి విరుద్ధంగా నడిచేదాన్ని కాను. రండి.

ఇంద్రజిత్తుడు చేసేదిలేక కమలిని తన్ను కూర్చుండబెట్టిన చోట కూర్చున్నాడు. కాని అతని హృదయంలో సందేహ నివృత్తి మాత్రం జరగలేదు.

కమలిని:- ఇంద్రజాలాన్ని చూడటానికి మహారాజు వెళ తాడా; లేదా?

ఇంద్రజిత్:- వెడతాడు.

కమలిని:- ఎప్పుడు?

ఇంద్రజిత్:- నాకా విషయం సరిగా తెలియదు. రేపో యెల్లుండో బయలు దేరవచ్చు.

కమలిని:- మమ్మల్ని కూడా వెంటతీసుకొని వెళ్ళరా?

ఇంద్రజిత్:- నాకేం తెలుసు? గోపాలసింహ అన్నగారి నడుగు.

కమలిని:- అవును. ఆయననే అడుగుతాను.

ఇంద్రజిత్: కిశోరినికూడా మీ వెంట తీసుకొని వెళ్ళండి.

కమలిని:- ఆమెను వివాహం చెయ్యనిదే మన యింటికి తీసుకొని రావటానికి వీలులేదు. అందుచేతనే ఆమెను తాత గారి నివాసంలోకి పంపించాము. అందుచేత వివాహం అయ్యే వరకూ ఆమె యిక మనతోపాటు ఉండటానికి వీలు లేదు.

ఇంద్ర:- మహారాజు ఒప్పుకుంటే...

కమలిని:- అయితే మమ్మల్ని రెండోసారి తీసుకు వెడతారా?

ఇంద్రజీ:- ఈసారి మిమ్మల్ని తీసుకొని వెళ్ళవిషయం మహారాజు గారి యిష్టంమీద ఆధారపడి ఉన్నది. ఆయన యెవరిని కావాలంటే వారిని తీసుకొని వెళతారు.

కమలిని:- సరే! అలాగే కానియ్యండి! ఇంద్రజాలంలో ప్రవేశించటానికి ఇప్పుడేమీ ప్రమాదా లుండవుకదా? మమ్మల్ని మీరు కావాలనుకొంటే యెన్నిసార్లయినా తీసుకొని వెళ్ళవచ్చునా.

ఇంద్రజీ:- ఇంద్రజాలంలో కొన్ని ప్రదేశాలు నిరుపద్రవమైనవీ మరికొన్ని యింద్రజాలాన్ని భేదించినప్పటికీకూడా ప్రమాదాన్ని కలిగించేవీ ఉన్నాయి. అయినా మిమ్మల్ని అక్కడికి తీసుకొని వెళతాను.

కమలిని:- చెలువు మధ్యగల నా యింటి అడుగున గూడా ఒక యింద్రజాలం తప్పకుండా ఉండి ఉంటుంది. రక్తలిఖిత పుస్తకం చదివితే ఈ అనుమానం నాకు కొంత కలుగుతోంది.

ఇంద్రజీ:- నీ అనుమానం త్రోసిపాఱవేయటానికి వీలు లేదు. ఇంద్రజాలగ్రంథాన్ని చదివితే మా సోదరులిద్దరికీ కూడా

ఆ అనుమానం కలిగింది. దానికి మించి నాకు నీ యిల్లంటే ఎంతో ప్రీతి. పనులన్నీ పూర్తియైన తరవాత కొన్నాళ్ళక్కడ ఉందామనుకొన్నా గాని—

కమలిని:- ఇప్పుడేమైంది?

ఇంద్రజీ:- ఇప్పుడా యింటి అధికారం నీ పతి దేవునిది.

కమలిని:- అయితే ఆయనతో చెప్పి మీ కాయిల్లు ఇప్పిస్తాను.

ఇంద్రజి:- అలాంటిపనిఏమీ నీవు చెయ్యవద్దు. కమలినీ నీవు నన్ను చాలా మోసంచేశావు. ఇలా చేస్తావని ఎప్పుడూ అనుకోలేదు. ఇంతకూ నిజంగా నీ వివాహమైందా?

కమలిని:- అయింది.

ఇంద్రజి:- ప్రమాణంచేసి చెప్పు?

కమలిని:- ప్రమాణపూర్వకంగా నా వివాహమైంది.

ఆ సమయంలో యువరాజు హృదయం క్షణక్షణోద్రిక్త కల్లోలమాలాకుల పారావారంలో మునిగిపడుతూవున్న నౌక మాదిరిగా ఉన్నది. పాపం! అప్పుడతనికి హృదయభారం ఏ విధంగానూ తొలగించుకోరాని దయింది. అది క్రక్కటానికి మ్రింగటానికికూడా వీలులేనిదిగా అతనిని చంచలితుణ్ణి చేస్తున్నది. కమలిని మాత్రం వికసితముఖకమలంతో వసంతహేళా పరిభుక్త రసాల కిసలయ సనోల్లసిత పికరమణిలాగా కలకలా రావంతో అతని హృదయాన్ని సమ్మోహింపజేస్తూ పకపక నవ్వుతూవున్నది. అతను ఆ జగన్మోహినిని వదలి వెళ్ళలేక పోతున్నాడు. అయితే పరదారాభి గమనానికి ఎంతమాత్రం అంగీకరించని సనాతన సంస్కృతి ముద్రిత చిత్తసంవత్తివల్ల

సాహసించి ఆ కోర్కను అణచుకోలేకపోతున్నాడు. విపరీతంగా ఒక నిట్టూర్పు విడిచి తనగదిలోనికి వెళ్ళిపోయాడు.

ధార్మికులు ఎంత వ్యామోహాన్ని అయినా నిగ్రహించుటానికే యత్నిస్తారుగదా! ఆ యత్నమే వారిని అకార్యకరణానికి అతీతులను చేస్తుంది. అయితే ఈ మధ్యకాలంలో మానసిక సంక్షోభం ఎంతటివారికీ తప్పదు. అది మనుష్యసాధారణం. ఆ రాత్రి యువరాజుకు కంటిమీద కునుకే లేదు.

## 5

మహారాజు ఆజ్ఞానుసారంగా రాకుమారులయొక్క వైవాహిక కార్యక్రమాలు బ్రహ్మాండంగా కొనసాగిపోతున్నాయి. అక్కడనుండే మనారగఢంవరకు నెత్తైబాట కిరు వైపులా చలువపందిళ్ళు వేశారు. అక్కడక్కడ ఎత్తయిన వేదికలు నిర్మించి వాటిపై మంగళ వాద్యాలు యేర్పాటు చేశారు. గొప్ప గొప్ప శిల్పులనూ, కళావిదులనూ రావించి ఎన్నెన్నో కన్నులపండువజేసే యేర్పాట్లను చేయించారు. ఆ వివాహాన్ని చూడటానికి నేల నాలుగు చెరగులనుంచీ ప్రజలు రోజు రోజుకూ తండోప తండాలుగావచ్చి చేరుకొంటున్నారు.

ప్రస్తుతం ఇంద్రజాలాన్ని గురించి తెలుసుకొందాం. ఇంద్రజాలాన్ని చూడటానికి రాజపరివారమంతా బయలుదేరి వెళ్ళుతోంది. ఆ పరివారంతో అప్పుడు ఇంద్రజాలంలో కనిపించిన ఖైదీలు అనగా ముసుగు మనుష్యులూ, భైరవసింహుడూ తారాసింహుడూ లేరు. ప్రస్తుతం దేవిసింహునికంటే

భూతనాథుడు చాలా ఆందోళన పడుతున్నాడు. అతనికి తన
భార్యను గురించిన చింత ఒకవైపున పీడిస్తోంది. ముసుగు మను
ష్యులుగా ఉన్నవారూ, ఆ విచిత్ర గృహంయొక్క యజ
మానులుగా నటించినవారూ, ఈ యిద్దరూ రాక్షసమాంత్రికులేనని
విదితం కావటంవల్ల భూతనాథునికి కొద్దిగా సంతృప్తి కలగ
జొచ్చింది. ఐనా పూర్తి వివరాలు తెలుసుకోవాలనే జిజ్ఞాస
అతణ్ని ఒకవైపున వేధిస్తోంది. కుమారుడైన హరనాథసిం
హుడూ, భార్యా ఎక్కడ ఏవిధంగా ఉన్నారో అతనికి తెలి
యదు. ఇప్పుడు వారి వివరాలు తెలుసుకునేందుకే అందరూ
వెళ్ళుతున్నారు.

పరస్పరం సంభాషించుకుంటూ నెమ్మదిగా నడక
సాగించి అందరూ గుహను సమీపించారు. అప్పటికి ఒకజాము
ప్రొద్దుకూడా ఎక్కలేదు. సురేంద్రసింహ మహారాజు, వీరేం
ద్రుడూ మొదలైనవారు గుర్రాలను దిగారు. అందరూ
సొరంగంలో ప్రవేశించారు. ఆ సొరంగపు త్రోవ వివరాలను
మనం లోగడ ఒకసారి చదివిఉన్నాము. రాకుమారులిద్దరూ
ఆ గుహామార్గం ఎలా బంధించవచ్చునో తమవారికి వివరిం
చారు. ఆ మార్గ మధ్యంలో ఉన్న అరుగే ఆ మార్గాన్ని
బంధించటానికి కీలకం.

అందరూ సొరంగాన్ని గడిచి బయటప్రదేశాన్ని చేరు
కొన్నారు. ఎదురుగా వారికి ఒక బంగాళా కన్పించింది. ఆ
బంగాళా ముందు వసారాలో ముసుగులు వేసుకొన్న యిద్దరు
స్త్రీలు విల్లూ, అంబులూ ధరించి పహరా యిస్తున్నారు. ఆ
ఇరువురనూ చూచిన భూతనాథునికీ, దేవీసింహునికీ ఆశ్చర్యా

కలిగింది. భూతనాథునికి సంజ్ఞవల్ల దేవిసింహుడు ఇంద్రజేతసిం
నితో "ఆ ముసుగు మనుష్యులెవ్వరు ?" అని అడిగాడు.
దానికి యువరాజు మౌనం ధరించగా సురేంద్రసింహుడు
"ఎందుకయ్యా మీకంత తొందర ? కొంచెం ఆగితే అన్నీ
తెలుస్తాయిగా" అన్నాడు. దేవిసింహుడూ, భూతనాథుడూ
మాటుమాట్లాడక మౌనం వహించారు.

ఆ స్త్రీలిద్దరూ తమదిక్కుగా వస్తున్న రాజపరివారాన్ని
గుర్తించి ఆ జనసమూహం వసారాను చేరుకొనేసరికి బంగళా
లోనికి వెళ్ళి అదృశ్యులై పోయారు. ఆ బంగళా ఇప్పటికిన్నీ
లోగడ భూతనాథుడూ, దేవిసింహుడూ చూచినట్లే ఉన్నది.

దాని అంతర్భాగం బైటకు కన్పించినంత సాధారణంగా
లేదు. ఆ విషయం వసారాలో అడుగుపెట్టగానే అందరూ
తెలుసుకొన్నారు. ప్రతిభాశాలురైన శిల్పులు గోడలలో
తయారుచేసి పెట్టిన కళాఖండాలను చూచి అందరూ ఆశ్చర్య
పోయారు. ఆ బొమ్మలపైన ఈ విధంగా వ్రాసి ఉన్నది.

"ఈ ఇంద్రజాలం చునారగఢం సమీపాన గల సుందర
తరమైన ఒక అడవికి సంబంధించి ఉన్నది. దీనిని సురేంద్రసింహ
మహారాజు పుత్రుడైన వీరేంద్రుడు భేదించగలడు."

ఆ శిల్పాన్ని చూడటంతోనే అందరికీ ఇంద్రజాల వతి
ఉన్న భవనం గుర్తుకువచ్చింది. ఆ భవనంకూడా సరిగా ఇట్లాగే
వుండేది. అదికూడా ఈ భవనం మోస్తరుగానే కాలక్రమాన
శిథిలమైపోయింది. ఆ శిల్పాన్ని చూచి వీరేంద్రసింహుడు
ఆశ్చర్యచకితుడై "ఇది మా కాలంలో ఎంతో గట్టిభవనమే"
అన్నాడు.

సురేంద్రుడు :- ప్రస్తుతం ఇంద్రజాల శిథిలాలవద్ద జీత సింహుడు నిర్మిస్తున్న భవనాలకంటేకూడా ఇది చాలా అందమైనది.

జీత :- అవును. దీని నేను చూచివున్నట్లయితే ఇల్లాగే కట్టించివుండేవాడిని.

వీరేం :- అవును. అలా కట్టించగలిగితే చాలా బాగుండేది.

ఇంద్రజీ :- చునారగఢపు ఇంద్రజాలం సాధారణమైనది కాదు. ఆ ఇంద్రజాలం చునారగఢ, నౌగఢ, విజయగఢ, జమానియాలవరకూ వ్యాపించి ఉన్నది. మనం ఈ బంగళాను ఆ ఇంద్రజాలానికి కేంద్రస్థానంగా భావించుకోవచ్చు. అంతేగాక ఈ బంగళా మొత్తం ఇంద్రజాలపు నమూనాకూడా అన్నాడు.

ఈ విధంగా చాలాసేపు వసారాలో నిలబడి రాజ పరివారం సంభాషించుకున్నమీదట రాకుమారులు అందరినీ లోనికి తీసుకువెళ్ళారు. ప్రధానద్వారం వరదాను తొలగించి లోపల ప్రవేశించేసరికి అది గోళాకారంగా వున్న గదిగా కన్పించింది. ఆ గదిని భూతనాథుడూ దేవీసింహుడూ లోగడ చూచి ఉన్నారు. ఆ చోట గోడలకు సమున్నత పర్వత శ్రేణులూ సాంద్రారణ్యాలూ రోహితగఢమూ చిత్రించిన పటాలు వ్రేలాడుతున్నాయి. ఆ చిత్రాలన్నీ అప్పుడే చిత్రించి పెట్టినట్లు సరిక్రొత్తదనంతో అత్యంతాశ్చర్యం కలిగిస్తున్నాయి. రోహితగఢ చిత్రాన్ని చూచి అందరూ ముగ్ధులైపోయారు. వీరేంద్రసింహుడు, తేజసింహుని చూచి "తేజసింహా! ఈ

చిత్రంలో రోహితాగఢ దుర్గాన్ని, ఆ పరిసరారణ్యాన్ని ఎంత స్పష్టంగా చిత్రించారో చూశారా!" అన్నాడు.

తేజ:- అవును! అరణ్యం అచ్చే మోస్తరుగా ఉన్నది. (వేలితో చూపుతూ) చూడండి! ఇదిగోరెల దొడ్డి. ఈ మార్గంగుండానే మనం రోహితగఢపు చీకటికోట్లో ప్రవేశించాము. చిన్న చిన్న అక్షరాలతో 'ఇది చీకటికొట్టులోనికి దారి' అని కూడా వ్రాసి వున్నది.

ఇంద్రజిత్:- ఈ చిత్రాన్ని మనం జాగ్రత్తగా పరిశీలించినట్లయితే అక్కడ పరిస్థితులు చాలావరకు తెలుస్తాయి. ఈ భవనాన్ని నిర్మించిన కాలంలో రోహితగఢపు పరిస్థితి యే విధంగా ఉన్నదో ఆ విధంగానే యీ చిత్రంలో ఉన్నది. అందుచేత ఇప్పటికి కొంచెం మార్పు వచ్చి ఉండవచ్చు.

తేజ:- అవునవును.

ఇంద్ర:- అంతేగాక మీకు మరోవిషయం చెబుతాను.

వీరేం:- ఏమిటదీ?

ఇంద్ర:- ఇక్కడనుండి రోహితగఢానికి వెళ్ళేమార్గం కూడా వున్నది.

సురేం:- ఆఁ! అయితే నీవా మార్గాన్ని తెరువగలవా?

ఇంద్ర:- చిత్తం. మేము చాలాదూరం వెళ్ళివచ్చాము కూడా.

సురేం:- నీ కీ రహస్యం ఎలా తెలుసు?

ఇంద్ర:- ఆ రక్తలిఖిత గ్రంథ కారణంగా మాసోదరు లిద్దరం ఇక్కడి రహస్యాలన్నీ తెలుసుకోగలిగాము. మీరు అనుమతించినట్లయితే ద్వారాన్ని తెరచి మిమ్మల్ని రోహిత

గఢపు చీకటిగుహాలోనికి తీసుకువెళతాము. ఆ చీకటిగుహాలో
కూడా ఒక రహస్యంవున్నది. దానికీ ఈ యింద్రజాలానికీ
సంబంధంవున్నది. మేము దానిని ఛేదించలేకపోయాము.

సురేం:- రోహితగఢపు చీకటిగుహాలోని రహస్య
మేమిటి?

ఇంద్రజిత్:- ఆ గుహాలో ఇంతవరకు ఎవరూ కనివినీ యెరు
గని అత్యద్భుతాలయిన ఆయుధాలున్నాయి. ఆ ఆయుధాల
తోనే ఈ యింద్రజాలం నిర్మితమయింది. ఆ ఆయుధాలు మా
దగ్గరవున్న యింద్రజాలఖడ్గంలాంటివి. గోపాలసింహుడు విచిత్ర
మైన శిరస్త్రాణాలను, త్రాణాలను ధరించి కృష్ణాజినునిరూపంలో
అనేకాద్భుతాలనుచేసిన సామగ్రంతావున్న అక్కడ గుట్టలు గుట్ట
లుగా పడివున్నాయి. అయితే ధనంమాత్రం ఏమీలేదు.

సురేం:- లేకపోతే ఏం? అటువంటి ఆయుధాలు ధనాని
కేమాత్రం తీసిపోవు.

జీవ:- అవును. అయితే ఇంద్రజిత్సింహా! మీ సోదరు
లిద్దరూ ఛేదించిన భాగంలోకూడా అటువంటి ఆయుధా
లున్నాయా?

ఇంద్ర:- ఉన్నాయి, కాని చాలా తక్కువ.

వీరేం:- ఈశ్వరానుగ్రహం ఉంటే ఈ మార్గంగుండా
రోహితగఢానికి వెళ్ళే ప్రయత్నం చేద్దాం. ఈ కనుపిస్తున్న
సామగ్రులన్నీ మీ యింద్రజాలంలో నుంచి తెచ్చినవేనా?

ఇంద్ర:- లేదండీ! మేమిక్కడకు వచ్చినప్పుడునూ,
ఈ భవనం ఇదేవిధంగా మూగ్గురు నలుగురు మనుష్యులుకూడా

ఈ భవనానికి సంరక్షకులుగా ఉండి వాళ్ళు మా కోసం ఎదురు
చూస్తున్నారు కూడా.

సురేం :- వాళ్ళెవరు? ఇప్పుడెక్కడున్నారు?

ఇంద్ర :- వాళ్ళు ఇంద్రదేవుని అనుయాయులు. ప్రస్తుతం యజమానివద్దకు వెళ్ళిపోయారు. ఈ ఇంద్రజాలంయొక్క ప్రధాన సంరక్షకుడు ఇంద్రదేవుడు. అతని పూర్వం కూడా అతని వంశస్థులే ప్రధాన సంరక్షకులుగా ఉంటూ వచ్చారు.

సురేం :- నీవు చాలా సంతోషకరమైన వార్త విన్పించావు. కాని యీ విషయాలన్నీ యింద్రదేవు డెందుచేతనో మాకు తెలియజేయలేదు.

ఆనం :- ఇంద్రజాలంయొక్క నియమానుసారంగానే ఇంద్రదేవుడు తెలియజెప్పకుండా ఉన్నాడు. కనుక మనం ఆశ్చర్యపడ నవసరంలేదు.

సురేం :- అవునవును. అయితే ఈ సామానులన్నీ యింద్రదేవుడే మీ కొరకు ఇక్కడకు తెప్పించి ఉంటాడు.

ఆనం :- అవును. ఆ విషయాన్ని అతని మనుష్యులు మాతో చెప్పారు.

రాజపరివారం అక్కడనుంచి ముందుకు సాగింది. గోళాకారంగా ఉన్న ఆ గదికి ఇంకా మూడువాకిళ్ళున్నాయి. రాకుమారులు అందరినీ వెంటపెట్టుకొని కుడివైపు వాకిలి గుండా తీసుకొని వెళ్ళారు. అక్కడ వారు భూతనాథుడూ, దేవీసింహుడూ లోగడ చూచిన ఒక అతి విశాలమైన గదిని చూచారు. ఆగదిలోని చిత్రాలు ఇతర స్థలాలలో గల చిత్రాలన్నిటికంటేనూ మిక్కిలి అందంగా కన్పిస్తున్నాయి. ఆ

చిత్రాలలో అడవులూ, మైదానాలూ, పర్వతాలూ, గుహాలూ, లోయలూ, సెలయేళ్ళూ, దుర్గాలూ యోధ శ్రేణులు ఇత్యాది దృశ్యాలెంతో ఉన్నాయి. వాటిని రాజ పరివారమంతా ఆశ్చర్యచకితులై చూడసాగారు.

సురే:– (ఒక దుర్గాన్ని చూపుతూ) ఇది చండారగఢ చిత్రంలాగుంది.

ఇంద్ర:– అవును. ఇది జమాలియాదుర్గం. ఆ దుర్గంలోని ప్రత్యేకమైన తోట. ఇక్కడనుండి అక్కడకు వెళ్ళే మార్గంకూడా ఉన్నది. సూర్యకాంత మహారాజు కాలంలో ఆయన విహారం చేసే చోటూ, అదీ, ఇల్లానే ఉండేది.

పీరేం:– ఈ యోధశ్రేణులేమిటి?

ఇంద్ర:– ఈ చిత్రంలో చాలా పనితనం ఉన్నది. సూర్యకాంత మహారాజు తన సైన్యంతో వ్యూహాలను పన్నటము, సైనికశిక్షణ ఇవ్వటం మొదలైన ఘట్టాలు ఈ ఇంటిలో ఉన్నాయి. జాగ్రత్తగా చూచినట్లయితే ఈ చిత్రాలలోని సైనికులు సచేతనులుగా ఉన్నట్లు వారి పదధ్వనులను సైతం మనకు వినిపింపజేసేటట్లు కన్పిస్తాయి. సైనిక శ్రేణులముందు యుద్ధవాద్యాలను వాయిస్తూ నడిచేవారు మనకు ప్రత్యేకంగా కన్పిస్తారు. అయితే ఈ తమాషా రాత్రిపూట మనం చూడగలం. ఈ చిత్రాలవల్లనే ఈ గదికి వ్యూహామండపం అని పేరు పెట్టారు. అదుగో! ఆపైన పెద్దపెద్ద అక్షరాలతో వ్రాసివున్నది చూడండి.

సురే:– ఆహా! ఏమి పనితనం! ఈ విచిత్రాలను ఇంకా చాలామందికి చూపించటంకూడా అవసరం.

ఇంద్రః- సరే! ఇంకా ముందుకు నడవండి.

ఆ గదికి గోడల ప్రవేశించిన వాకిలిగాక మరొక వాకిలి వున్నది. ఆ వాకిలిగుండా దాసమానులు అందరినీ వేరొక గదిలోనికి తీసుకువెళ్ళారు. ఆ గదిగోడలు మామూలుగానే వున్నాయి. ఏవిధమైన చిత్రపటాలూ లేవు. ఐతే గదియొక్క మధ్యభాగంలో పాలరాతి వేదికలు రెండున్నాయి. ఒకదాని మీద తెల్లని అందమైన బొమ్మ వున్నది.

ఇంద్రః- (గోపాలుని చూపిస్తూ) ముసుగు మనుష్యులారా! మీరు మా యింద్రజాలం వృత్తాంతాన్ని విన్నారు జ్ఞాపకం వున్నదా? నాన్న చెప్పినట్లు మేము మొట్ట మొదట యింద్రజాలంలో నుండి బయలుపడింది ఇక్కడికే. ఈ వేదికలో నుండే మేంబయటికివచ్చాం. ఇక్కడివరకూ రక్తగ్రంథం సహాయంతో వచ్చాం. కాని, యిక్కడనుండే యిక ఆగ్రంథం లో ఏమీ వ్రాసిలేదు. అయితే ఈ వేదికలో మాకు వేరొక పుస్తకం దొరికింది. దానిసహాయంతో ఈవేదికను భేదించు కొని విముక్తుల్ని చేసుకోగలిగాము. మేమిద్దరం మాయారాణి ఖైదునుండి గోపాలసింహ మహారాజును విడిపించుకొని జమాని యా ప్రత్యేకమైన తోటలో గల దేవీమందిరంలోనికి వెళ్ళాం. అక్కడ ఆనందుడు మొట్టమొదట ఇంద్రజాలంలో చిక్కుకున్నాడు. అతణ్ణిరక్షించటానికి నేనుకూడా ఆ బావిలో దూకి నడుస్తూ నడుస్తూ ఇంకో తోటలో ప్రవేశించాను. ఆ తోట మధ్య భాగంలో ఒకమందిరం ఉన్నది. ఆ మందిరంయొక్క యింద్రజాలాన్ని నేను భేధించినప్పుడు ఒక బొమ్మలోనుండి మోస్తూ నా కొకవస్తువు దొరికింది.

సురేం :- అవునవును! నీవా బొమ్మను చూపి ఒక గదిలోనికి దారి చేశావు అది మార్గమైపోయింది. దాని పొట్టలోను-చీ...

ఇంద్ర :- అవునవును.

సురేం :- అయితే ఆ మెరిసే వస్తువేమిటి? అది యిప్పుడు ఎక్కడ ఉన్నది.

ఇంద్ర :- అది ఇంద్రజాల తాపడంచేసిన తాళపు చెవి. అది యిప్పుడు నా దగ్గరనే వున్నది. ఇదుగో! ఈ తాళంచెవే ఈ బొమ్మ పొట్టలో సరిపోతుంది.

అతడు ఆ వేదికమీదగల బొమ్మయొక్క నాభిలో తాళంచెవి పెట్టి ఒకపెట్టె మూత తెరచినట్లు తెరచాడు. "ఇందులోనే నాకు పుస్తకం దొరకింది." అన్నాడు.

సురేం :- ఇప్పుడు ఏదీ ఆ పుస్తకం.

ఇంద్ర :- ఆనందసింహునివద్ద వున్నది.

ఆనందసింహుడు పుస్తకాన్ని తీసి మహారాజు కిచ్చాడు. దానిలోని అక్షరాలు చాలా చిన్నవిగా వున్నాయి. అది భూర్జపత్రాలమీద వ్రాసింది. సురేంద్రసింహుడు కొద్దిగా చదివినట్లు చదివి తీరికగా చదువుదామని ఆనందసింహునికి ఆపుస్తకాన్ని తిరిగి యిచ్చాడు.

ఇంద్రజిత్:- "ఇంద్రజాలంలో ప్రవేశించటానికి ఈబొమ్మ ఉన్న వేదికే మార్గం." అని అతడు ఆబొమ్మపొట్టలో చెయ్యి పెట్టి మీట నొక్కాడు. అప్పుడు వేదికయొక్క కుడివైపు గోడ వాకిలివలె తెరచుకొన్నది.

క్రిందకు దిగటానికి మెట్లు కన్పించాయి. ఇంద్రజిత్తు మొనవుకత్తి పిడిని ఒత్తుతూ ఆ వెలుతురులో తనవెంట అంద రినీ క్రిందికి తీసుకువెళ్ళాడు. అందరి వెనుకగా అవంతసింహుడు మొనవుకత్తి పిడి ఒత్తి పట్టుకొని దిగుతున్నాడు. దాదాపు వంద పాతిక మెట్లు ప్రదక్షిణిస్తూ క్రిందకు దిగివచ్చాక వారు అందరూ ఒకపెద్ద గదిలో ప్రవేశించారు. ఆ గదిలో వెండీ, బంగారం, మణులూ, మాణిక్యాలూ, నగలూ, వజ్రాలు గుట్టలు గుట్ట లుగా పడివున్నాయి. కన్నులు మిరుమిట్లుగొలిపే ఆ సంపదను చూచి మహారాజు ఆశ్చర్యచకితుడై "ఈ ధనాన్ని లెక్క కట్టటంకూడా మనకు అసాధ్యమే" అన్నాడు.

ఇంద్ర:- ఈ యింద్రజాలంలో నేను చూచినసంపదలో ఇది యెన్నోవేలరెట్లు తక్కువ. దానిని అతిత్వరగా మన ఐంద్ర జాలికులు మీదగ్గరకు చేరుస్తారు. ఈ ధనంతోపాటు ఇక్కడ మరొక విచిత్రంకూడావున్నది. దానివల్ల మీ మొకసారి నవ్వుతూ నవ్వుతూ గోడమీదనుంచీ దూకి మాయామారాణిచేతిలో బంధి తుల వయ్యారు

జీత:- అరెరే! అటువంటిదేదైనావుంటే దాన్ని త్వరగా బయటకు పారెయ్యండి. యువరాజుల వివాహసందర్భంలో ఆ విచిత్రాన్ని అందరికీ చూపుతాం.

సురేం:- తప్పకుండా అలాగేచేద్దాం.

ఇంద్ర:- ఈ యింద్రజాలంలో ప్రవేశించటానికిపూర్వమే మేము ముసుగుమనుష్యులను విడిచిపెట్టాము. కేవలం మేమిద్ద రమే యిందులో ప్రవేశించి ఎన్నోపనులుచేస్తూ మీదగ్గరకు వచ్చాం.

సురేం :- అయితే ఆ విధంగానే మన మందిరం ఇప్పుడు తమాషాలు చూస్తూ బయటపడదామా ?

జీత :- అయితే ఆ సజీవంగా ఉన్న సైనిక శ్రేణుల విచిత్రాన్ని చూడవద్దూ ?

సురేం :- అవునవును. దాన్ని తప్పకుండా చూడాలి.

ఇంద్ర :- అయితే ఇక్కడనుండే వెనుకకు వెళదాం పదండి. ఈ గదినిదాటి ముందుకు వెళ్ళామా; ఇప్పట్లో బయట పడటం కష్టం. అందులో ప్రొద్దుకూడా ఎక్కువలేదు. ఇంకా భోజనాలవీ చేయాలి.

సురేం :- అలాగైతే వెనకకే తిరుగుదాం పదండి.

అందరూ వెనుకకు తిరిగి ఆ భవనం బయటికివచ్చారు. అప్పటికి సూర్యుడు అస్తాద్రి శిఖరాలను సమీపించాడు.

## 6

అప్పుడే ప్రొద్దు క్రుంకింది. భోజనాలవీ ముగించుకొని గోళాకారపు గదిని దాటి వారందరూ ప్రక్కగదిలో ప్రవేశించారు. ఆ గదిలోపల దేదీప్యమానంగా దీపాలు వెలుగుతున్నాయి. భూతనాథునికీ, దేవసింహునికీ ఈ దీపాలంకరణ చేసింది ఆ యుద్ధ స్త్రీలేననే అనుమానం కలిగింది. మహారాజుగాని యితరులుగాని ఆ స్త్రీలనుగురించిన ఆలోచనే మరచిపోయారు. ఇంద్రజీతుని ఆజ్ఞానుసారం ఆ గదిలో వెలుతురు లేకుండా చెయ్యటం జరిగింది. అందరూ ఎక్కడివారక్కడ తివాచీలమీద కూర్చున్నారు. ఆ అంధకారంలో ఒకడికి మరొకడు ఏం చేస్తున్నాడో కన్పించటంలేదు. కొద్దిసేపట్లో

గోడలు మెఱిసిపోయాయి. రంగులు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఇప్పుడా చిత్రాలు సజీవ చిత్రాలుగా కన్పిస్తున్నాయి. దూరాననుండి, దుర్గాలను, అంతఃపురాన్ని, గ్రామాలను చూచి నట్లుగా ఆ దృశ్యాలున్నాయి. అందరూ ఆశ్చర్యచకితులై ఆ దృశ్యాలను చూస్తున్నారు. ఆ వెనుక వాద్యాలచప్పుడు విన్పించింది. అందరిదృష్టి జయమాలిని గుర్రం చిత్రంమీద పడింది. అక్కడనుండే ఆ ధ్వని వస్తోంది.

ఒక సువిశాలమైన మైదానంలో అసంఖ్యాకమైన సేనా వాహినులు నిలబడి ఉన్నాయి.

అది రెండుభాగాలుగా యుద్ధానికి తలపడుతున్నది. పదాతిదళం, అశ్వికదళంకూడా ఉన్నాయి. శతఘ్నులు కూడా కన్పిస్తున్నాయి ఆ సైన్యంలో ఒక వర్గంవారి దుస్తులు తెల్ల గానూ మరొకవర్గంవారి దుస్తులు నీలంగానూ ఉన్నాయి. తెల్లని దుస్తులు ధరించిన సైన్యంనుండి ధ్వని విన్పిస్తుంది. నెమ్మది నెమ్మదిగా ఆ సైన్యం కదలసాగింది. ఆ సైన్యం దూరానగల పర్వతం ప్రక్కగా పయనించసాగింది. ఆ సేనతో పాటుగల యుద్ధ వాద్యాల సవ్వడికూడా దూరమైపోయింది. ఆ సైన్యం చాలా క్రోసులు పరుగెత్తినట్లు పరుగెత్తి పర్వతం వెనుక మాయమైపోయింది. ఇప్పుడు మైదానంలో సగం సైన్యంమాత్రమే ఉన్నది ఆ నీలరంగు దుస్తులుకల ఆ సేన కూడా కదలసాగింది. ఆ సైన్యంలోనుంచికూడా యుద్ధ వాద్యాలు విన్పించాయి. ఒకడు గుర్రమెక్కి చేతిలో జెండా పట్టుకొని సైన్యాలను కవాతు చేయిస్తున్నాడు. ఆ కవాతు కొన్ని గంటలపాటు జరిగింది. అప్పుడు ప్రధానసైని

కాధికారిని చూశాడు. సైన్యం సంతోష తరంగితమైంది. మహా
రాజు ఆ దృశ్యాన్ని చూసి సైన్యాధిపతుణ్ణి అంటే ఇంద్రజాలికుణ్ణి
అన్నాడు.

క్షణాలలో పూర్తి అయిన తరువాత సైన్యం ముందుకు
సాగింది. ఇంతలో శత్రు సైన్యం పర్వతాన్ని దాటివచ్చి
ఈ సైన్యాన్ని దెబ్బతీసింది. ఇరుపక్షాలూ ఘర్షిల్లాయి.
ఆ భీకర యుద్ధాన్ని చూసి సుకేంద్రసింహుడూ మొద
లైన వారంతా దిగ్భ్రాంతి చెందారు. యుద్ధ వ్యూహాలు ఎలా
ఉంటాయో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నాయి. ఆ దృశ్యం
పూర్తికాగానే సభాభవనం చీకటైపోయింది. ఇంద్రజిత్సింహుడు
మెఱుపు కత్తితో వెలుతురు చేశాడు. అతని ఆజ్ఞప్రకారం
దేవసింహుడు గదిలో దీపాలు వెలిగించాడు. ఆ తరువాత
అందరూ నిద్రపోయారు. నిద్ర లేచేసరికి చాలా ప్రొద్దెక్కింది.
తెల్లవారిన తరువాత వారి అవసరాలకు కావలసిన ఏర్పాట్లన్నీ
చక్కగా జరిగాయి. కాని ఇంతవరకు ఎవరూ ఆ స్త్రీలను
గురించి ఆలోచించిన పాపాన పోలేదు.

## 7

ఆ బంగళాలో వంటచేసుకోటానికి అవసరమైన
ఏర్పాట్లుకూడా జరిగాయి. ఇంద్రజాలికులు వంటలు పూర్తి
చేశారు. అందరి భోజనాలూ పూర్తి అయ్యాయి. తర్వాత
రాత్రి చూచిన చలనచిత్రాలున్న గదిలోనికి వచ్చారు.
అందరికళ్ళూ ఆశ్చర్య పూరితంగా ఆ చిత్రాలపై నిలిచి
ఉన్నాయి.

సురేం:- ఎంత ఆలోచించినా ఈచిత్రాలు ఎలా చలించ గలిగాయో, అలా వాటిని చలింపజేసిన కళాకారుని ప్రతిభ యెటువంటిదో నేను ఊహించలేకపోతున్నాను. ఈవిధంగా చలన చిత్రాలంటూ ఉంటాయని ఎవరైనా చెప్పివుంటే నేను నమ్మేవాణ్ణికూడా కాదు. అలా చెప్పినవాణ్ని పిచ్చివాడని భావించేవాణ్ని. ఇప్పుడు స్వయంగా చూచాను. ఐనా నా కింకా ఆశ్చర్యంగానే ఉన్నది.

జీత :- అవును. నిజమే! కళ్ళారా చూచిన మనం ఈ విచిత్రాన్ని యితరులకు చెప్పికూడా ఏనాటికీ ఒప్పించలేము.

జ్యోతి:- ఇది యింద్రజాలం గనుక ఇక్కడి విషయాలు ఆశ్చర్యాన్ని గొలపటంలో వింత ఉండదు.

జీత:- ఎంత యింద్రజాలం అయినా దీనిని నిర్మించిన వాడు కడకు మానవమాత్రుడే గదా! కనుక మానవుని శక్తి మించిన విచిత్రాలు యింద్రజాలంలో మాత్రం ఎలా చూడ గలం?

గోపా:- మీరు చెప్పింది నిజమే. యింద్రజాల విశేషాలు ఎంత తమాషాగా ఉన్నా పరిశీలించి చూస్తే మనకు దాని నిర్మాణ విశేషాలు తెలియకపోవు. యింద్రజాలాన్ని సయితం మానవుడే నిర్మిస్తాడని మీరు చెప్పిన వాక్యం చాలా సబబుగా ఉన్నది.

వీరేం:- మనకు అర్థం కానంతసేపూ మాయాజాలం గానే భావించుకొన్నా మొత్తంమీద 'మానవుని కర్తృత్వమే దీనికి ప్రాతిపదిక' అని నమ్మితీరాలి. పరిశోధనచేస్తే అతని కర్తృత్వ శక్తియొక్క ప్రాభవం మనకు తేటతెల్లమవుతుంది.

ఈ చలన చిత్రాల నిర్మాణాన్ని పరిశోధించినట్లే దీని రహస్యంకూడా తెలుస్తుంది. బహుశః ఇంద్రజీతునికి ఈరహస్యం తెలిసి ఉండాలి.

సురే :— అవునవును, ఇంద్రజీతా! నీవీ చిత్రాలను ఏ విధంగాచలించేటట్లు చేశావు?

ఇంద్ర:— మీకీ రహస్యాన్ని తెలియజేస్తే చప్పరించి ఊరుకొంటారు. నాకూ మొట్టమొదట చాలా ఆశ్చర్యం కలిగింది. కాని యింద్రజాల గ్రంథసాహాయంతో మేమీ గోడలో ప్రవేశించి రహస్యాన్ని తెలుసుకొన్నాము.

సురేం :— ఐతే మే మింతగా మథనపడుతుంటే చెప్ప కుండా ఊరుకున్నావేం?

గోపా : ఇంద్రజాలికుల పటాటోపం పరీక్షించాలని.

సురేం :— సరేగాని దీనిసంగతేమిటో చెప్పు చూద్దాం.

ఇంద్రజీతసింహుడు గోడను సమీపించి సురేంద్రసింహునితో "చూడండీ! మీకు నే నీ రహస్యాన్ని చెబుతాను."

సురేంద్రసింహుడు ఇంద్రజీతుణ్ణి సమీపించాడు. మిగతా వాళ్లుకూడా అక్కడకు చేరారు. ఇంద్రజీతుడు గోడమీద చేయి వేసి "నిజానికి ఈ గోడమీద ఎటువంటి చిత్రాలూ లేవు. గోడ శుభ్రంగా వుంది. ఇది గాజుతో కట్టినది. మీకు కని పించే చిత్రాలు ఈ గోడలోపలనే దూరంగా ఉన్నాయి.

రాజకుమారుడు చెప్పే మాటలువిని అక్కడవారం దరూ ఆశ్చర్యపడ్డారు. గోడమీద చేతులు వేసి చూచారు.

జీత :— అవునవును. ఇప్పుడు మాకు తెలిసింది. ఈ చిత్రాలు వేరుగా లోహఫలకాలమీద చిత్రించినవి. అవి ఒక

తీగకు తగిలించి ఉన్నాయి. ఆ తీగను ఒకవైపున కదిలేట్లు చేసినప్పుడు ఈ చిత్రాలు కదులుతున్నాయి.

ఇంద్ర :— అవునంతే చూడండి. ఈ చిత్రాల నిప్పుడు కదలించి మీకు చూపుతాను. ఆ తర్వాత మిమ్మల్ని గోడ లోపలికి తీసుకువెళ్ళి అక్కడ ఏర్పాట్లు చూపిస్తాను.

ఆ గోడమీద జపానీయుల దుర్గ చిత్రం ఉన్నచోట ఆ దుర్గంయొక్క బురుజు లున్నచోట కొన్ని కంతలు కనిపించాయి. అందులో ఒక కన్నం ఒక చిన్నకత్తి జొరబడేటంత మాత్రమే ఉన్నది. ఇంద్రజీతుడు మెఱపుకత్తినితీసి ఆకన్నంలో దూర్చాడు. అతడు సురేంద్రసింహ జీతసింహులవంక చూచి "ఈ గోడలో ఉన్న యంత్రాలు విద్యుత్ప్రసారంవల్ల కదులుతాయి. ఈ మెఱపుకత్తిలో విద్యుత్తు కలదని మీకు తెలుసు. ఆ యంత్రాలకు ఈకత్తినుండి విద్యుత్ప్రసారం జరిగినప్పుడు అవి పనిచేయటం ప్రారంభిస్తాయి."

ఇలా చెప్పి ఇంద్రజీతుడు మౌనంగా నిలబడ్డాడు. మిగతా వారు పరీక్షగా చిత్రాలను చూడనారంభించారు. కొందరు చిత్రాలు కట్టబడ్డచోట చేతులు ఉంచారుకూడా. ఇంతలో గోడ వెలుతురైంది. ఆ తరువాత చిత్రాలు కదల నారంభించాయి. గోడమీదవేసిన చేతులు ఉన్నట్టే ఉన్నాయి. ఆ చేతుల అట్టడుగునుంచీ బొమ్మలు యథారీతి ముందుకు సాగి పోతున్నాయి. దానివల్ల గోడకూ చిత్రాలకు సంబంధంలేదనేది స్పష్టమైంది. అప్పుడు ఇంద్రజీతుడు మెఱపు కత్తిని బయటికి తీశాడు. ఆ వెనువెంటనే గోడలోని వెలుతురు అదృశ్యమై చిత్రాలు ఎక్కడివక్కడ ఆగిపోయాయి.

జీత :- చాలా విచిత్రంగా ఉన్నది. ప్రేతుకులను స్వర్గ మార్గాలలో ముంచెత్తటానికి దీనికంటే విమూత్నమైన వస్తువు మరొకటి ఉండబోదు

తేజః- అవునండీ ! ఒకరోజులో అనేక చిత్రాలను ఈ గోడమీద చూపించవచ్చు. ఆ చిత్రాలు ఏవిధంగా వచ్చి పోతున్నాయో యెవరికీ తెలియదు.

సురేః- చాలా బాగుంది. ఇప్పుడు యీ చిత్రాలను యథాస్థానంలో ఉంచి ఆపడం మంచిది.

"సరే. అలాగే" అని ఇంద్రజితుడు మొజువ్రక త్తిని కన్నంలో పెట్టాడు. చిత్రాలు కదలసాగాయి. చాలాసేపైన తరువాత ఒక విచిత్రమైన శబ్దం వచ్చింది. వెంటనే యింద్ర జితుడు కత్తిని వెలుపలికి తీశాడు. ఆ తరువాత సురేంద్ర సింహుడు తన మామగారితో తన్ను గోడలోనికి తీసుకువెళ్ళమని అడిగాడు.

ఇంద్రః- అలాగే తీసుకుని వెళ్ళతాకాని బైటనుంచే మీరు ఈ గోడ యెంత మందంగావుందో అంచనా వెయ్యండి చూద్దాం ?

సురేం:- దాని కేముంది. ఈ గోడదాటి మరొక గది లోనికి వెళ్ళే వాకిలిని చూచినప్పుడు ఈ గోడ మందాన్ని మేము లెక్క గట్టాము.

ఇంద్రః- సరే అయితే. ఆ ప్రక్క గదిలోనికి పదండి ! అక్కడనుంచే యీ గోడలోనికి వెళ్ళేమార్గం వున్నది.

అందరూ ఇంద్రజితుని వెంట ప్రక్కగదిలోనికి వెళ్ళారు. ఆ గదిలో ఒక అలమర కన్పించింది. దానికి మధ్యలో యినుప

పెడి ఒకటి ఉన్నది. దానిని యింద్రజిత్తుడు లాగాడు. అది బయటికి వచ్చింది. అతను దూరంగా నిలబడి చూచాడు. నెమ్మది నెమ్మదిగా ఆ అలమర తలుపులు తెరచుకొన్నాయి. ఆ వెనక వెంటనే యిద్దరు స్త్రీలు బయటికి వచ్చారు. వారిలో ఒకతె భూతనాథుని భార్య! మరొకతె దేవిసింహుని భార్య చంప! వాళ్ళను చూచి భర్తలు ఆశ్చర్యపడ్డారు. కోపంకూడా తెచ్చుకొన్నారు. మిగతావాళ్ళుకూడా ఆశ్చర్యంగా ఆస్త్రీలను చూడసాగారు. ఆ స్త్రీలిప్పుడు ముసుగు వేసుకొని లేరు. భర్తలను చూచి కొంగును ముసుగుగా వేసుకొన్నారు. తిరిగి అలమరాలో ప్రవేశించి అదృశ్యులై పోయారు. వారా విధంగా చేయటంవల్ల దేవిసింహునికీ భూతనాథునికీ బ్రంహాండమంతా నమలి మింగేటంత కోపం వచ్చింది.

## 8

సురేంద్రసింహ మహారాజు సపరివారంగా ఐంద్రజాల విశేషాన్ని పరిశీలించటానికి బయలుదేరిననాటి విషయానికి వద్దాం. ఆ పరివారంలో భైరవసింహుడూ, తారాసింహుడూ లేరని తెలుసుకున్నాం. అంటే వాళ్ళిద్దరూ యింటివద్దనే వున్నారన్న మాట.

రాజపరివారం వెళ్ళిపోయిన తర్వాత భైరవసింహుడు తన తల్లిని చూడటానికి తారాసింహుణ్ణి వెంటపెట్టుకొని అంతఃపురంలోనికి వెళ్ళాడు. ఆ సమయంలో చపల తన ప్రియసఖి అయిన చంప గదిలో కూర్చుండి ఏదో మాట్లాడుతున్నది. భైరవసింహుడూ తారాసింహుడూ రావటం గమనించి ఆమె

మాటలు ఆపి "మహారాజా! ఇంద్రజాలాన్ని చూడటానికి వెళ్ళారా?" అనిఅడిగింది.

భైరవః– అవును.

చపలః– (చంపతో) ఐతే నీవుకూడా బయలుదేరు.

చంపః– తప్పకుండా! మరి నీవుకూడా రావా?

చపలః– నాకూ రావాలని ఉన్నది కాని మామగారి ఆజ్ఞకావాలిగా.

చంపః– ఆయన యేమీ అనడులే. ఇంద్రదేవుడు నీకు మామగారని తెలిసినప్పటినుంచీ నాకు చాలా సంతోషంగా ఉన్నది.

చపలః– నాకూ చాలాసంతోషమే. సరే గాని, ఇప్పు డేంచేద్దాం? (భైరవసింహుణ్ణీ, తారాసింహుణ్ణీ చూచి) మీ రెందుకు వచ్చారు?

తారాసిం:–(చపలచేతిలో ఒకచీటిఉంచి) మేము ఎందుకు వచ్చామో దీనితో తెలుస్తుందిలే.

తారాసింహుని చేతినుండి చపల ఆచీటీ తీసుకొని చది వింది. ఆతరువాత చంపకిచ్చింది. చంపతో "సరే వెళ్ళు! మా కొరకు ఏమీ అవస్థపడవద్దని చెప్పు. నే నిప్పుడు కమలినినీ, లక్ష్మీదేవినీ కలుసుకొని అన్నివిషయాలూ మాట్లాడుతాను."

సరేనని చెప్పి భైరవసింహుడూ తారాసింహుడూ ఇంద్ర దేవుని విడిదివైపుగా వెళ్ళారు. సురేంద్రసింహ మహారాజు సపరివారంగా ఇంద్రజాలాన్ని చూడటానికి వెళ్ళినకొద్దిక్షణాల తర్వాత ఇంద్రదేవుడు ముసుగువేసుకొని గుఱ్ఱంమీద అదే దిక్కుగా ప్రయాణమయ్యాడు. అతనితో మరిముగ్గురు ముసుగు

మనుష్యులున్నారు. వాళ్ళు నలుగురూ ఆ వస్త్రాన్ని చేత
కొని కొంతసేపు ఆగారు.

ఇంద్రదే:- మనవాళ్ళు ఇంకా ఎందుకు రాలేదబ్బా ?

రెండవ:- వాళ్ళు వచ్చేదాకా ఇక్కడే ఆగుదాము.

ఇంద్రదే:- అలాగే.

మూడవ:- అనవసరంగా ఇక్కడ ఆగడమెందుకు?

ఇంద్రదే:- ఐతే ఏంచేద్దామంటావు ?

మూడవ:- మీరాను తొందరగా అక్కడకు చేరుకొని మీపని చెయ్యండి. నేనిక్కడఉండి వాళ్ళకోసం చూస్తాను. వాళ్ళు వచ్చినతరువాత ఆ వస్తువులన్నీ తీసుకొని మీవద్దకు వస్తాను.

ఇంద్రదే:- సరే కాని ఆ వస్తువులన్నీ నీ వొక్కడివే మోయగలవా?

మూడవ:- ఆ వస్తువులదొకలెక్కా! కావాలనుకుంటే వాటిని తెచ్చిన మనుష్యులతో కలిపి మోసుకురాలేనా !

ఇంద్రదే:- భలేవాడివే. ఇంతకీ త్రోవ మరచిపోలేదు కదా ?

మూడవ:- అబ్బే! అదెట్లా మరుస్తాను. కళ్ళకు గంతలు కట్టుకొనికూడా అక్కడకు రాగలను.

ఇంద్రదే:- నిజంగా నీవంత మొనగాడవే. సరే మేము వెళ్లుతున్నాం. నీ వా వస్తువులు తీసుకొని వాళ్ళను తిరిగి వెనకకు పంపించివెయ్యి.

ఇలా చెప్పి ఇంద్రదేవుడు ఇద్దరు మనుష్యులతో ముందుకుసాగాడు.

రాజపరివారం వెళ్ళినమార్గానికి దాదాపు ఒక మైలు దూరంలో వేరొక సొరంగపు మార్గమున్నది. దాని ముఖ ద్వారం చెట్లూ చేమలతో మూసుకుపోయి వున్నది. ఇంద్ర దేవుడూ ముసుగుమనుష్యులిద్దరితో కలసి ఆ సొరంగపుమార్గం గుండా లోనికి నడిచాడు.

## 9

దేవసింహుడు చంపను చాలా సత్యసంధురాలుగా భావించాడు. ఆమె నతడు పతివ్రతగాకూడా తలంచేవాడు. దేవసింహుని పాదాలనంటి చంప తాను ముసుగు మనుష్యుల యింటిలోనికి వెళ్ళలేదని విశ్వాసం కల్పించింది. అందుచే అతడు చంపను నమ్మాడు. కాని చంపను తిరిగి ఆ ముసుగుమనుష్యుల ఇంట చూడగానే అతడు కోపోద్దీప్తుడైనాడు కాని వెను వెంటనే అతడు కోపాన్ని చల్లార్చుకొని ఆలోచించసాగాడు.

"నేనేమైనా భ్రమపడ్డానా? లేదే? నాదృష్టి చాలా చక్కగానే ఉన్నది. ఐతే నేనుచూచిన స్త్రీ చంప కాదా? అవును. ఆమె. చంపవంటి సచ్ఛరిత్రురాలు ప్రమాణపూర్వకంగా అబద్ధాలు చెప్పటానికి సాహసిస్తుందా? ఆమె యేమని ప్రమాణం చేసింది? అవును. మీ పాదాల ప్రమాణంగా నాకేమీ తెలియదుకదా అన్నదికదూ? అవును. ఇవే ఆమె నోటినుంచి వచ్చినమాటలు. కాని ఆమెప్రమాణం నిజంకాదు. ఆమె ఒట్టువేసుకొన్నది తానక్కడికి రాలేదనిమాత్రమే కాని తనకా విషయాలు తెలియవనికాదుగా? ఐతే ఆమె నన్ను మోసగించిందా? అయినా నాకేం చింతకాదుగదా? ఒకవేళ

ఆమె మంచిపనికోసమే అలాచేసిందేమో? యువరాజులు ఆమె నలా చెయ్యమని ఆజ్ఞాపించితే పాప మామెమాత్రం ఏమిచేస్తుంది!"

ఇలాగే అతని ఆలోచనలకు అంతంలేకుండా ఉన్నది. కాని భూతనాథుడుమాత్రం ఇంకా క్రోధంలోనే ఉన్నాడు.

ఆ స్త్రీ లిద్దరూ అలమరలోనికి వెళ్ళిపోయిన తరువాత ఇంద్రజిత్ఆనందసింహులతోపాటు సురేంద్రసింహుడూ వీరేంద్ర సింహుడూ కూడా లోపలికి అడుగుపెట్టారు. వాకిలిని అంటు కొని కుడివైపుగా ఒక చీకటిగదిలోనికి మార్గం వుంది. ఆ మార్గాన్నిగూర్చి ఇంద్రజిత్‌సింహుడు "ఇది జమానియాకు వెళ్ళే మాను క్రిందనుదగిన తర్వాత ఒకసొరంగం వుంటుంది. అది తిన్నగా జమానియాకు చేరుకొంటుంది" అని చెప్పాడు.

ఆ మాటలు విని దేవీసింహుడూ భూతనాథుడూ తమ స్త్రీ లిద్దరూ ఆ మార్గంగుండానే పారిపోయి వుంటారను కొన్నారు. దేవీసింహునితో భూతనాథుడు "ఈ చీకటిగది లోనికి వెళ్ళుదామా?" అన్నాడు. దేవీసింహుడు అందుకు అంగీకరించలేదు.

ఆ గోడలో అందరూ ఒకేచోట చేరి చూడటానికి వీలున్నంతస్థలం లేదు. అందుచేత ఇద్దరుముగ్గురుకలసి ఒకొక్క సారిగా లోపలకు వెళ్ళి చలనచిత్రపు గదికి ఏర్పరచిన యంత్రాంగాన్ని చూచివచ్చారు. అందరూ చూచినతర్వాత ఆ గోడవాకిలి మూసివేశారు. ఆ తరువాత అందరూ విగ్రహం ఉన్న అరుగువద్దకు వచ్చారు. ఇంద్రజిత్తుడు దానివాకిలి తెరచి యింద్రజాలాన్ని చూపటానికి తాను సిద్ధంగా ఉన్నానన్నాడు.

సురేం :- ఐతే లోపలనుంచే ఇంద్రజాలాన్ని చూస్తూ చునారగఢపు ఇంద్రజాలాన్ని చేసుకోటానికి ఎంతసేపు పడుతుంది.

ఇంద్రజీ :- దాదాపు పన్నెండు గంటలు పడుతుంది.

సురేం :- రాత్రి ఐతే ఏమీ కష్టంలేదా?

ఇంద్రజీ :- ఏమీ కష్టంలేదు. రాత్రంతా ఎన్నో తమాషాలు చూస్తూ మనం ఉండవచ్చు.

"సరే ఐతే" అన్నాడు సురేంద్రుడు.

ఇంద్రజీతుడు ఆ వేదికయొక్క వాకిలిని తెరచి అందరినీ లోపలకు తీసుకువెళ్ళాడు. తోలుదొల్ల మణులూ మాణిక్యాలూ చూచిన గదిలోనికి చేరుకొన్నారు. ఆ గదికి రెండు వాకిళ్లున్నాయి. అందులో ఒకటి తెరచీ మరొకటి మూసీ ఉన్నాయి. తెరచి ఉన్న వాకిలినిగూర్చి ఇంద్రజీతుడు "ఇది జమానియాకు వెళ్ళేమార్గం. మా సోదరులిద్దరమూ ఇంద్రజాలాన్ని భేదిస్తూ ఇటునుంచే వచ్చాము. ఇక్కడనుంచీ చాలా దూరాన ఒక స్థలం ఉన్నది. దానిపేరు ఇంద్రజాల గ్రంథంలో 'బ్రహ్మమండలం' అని వ్రాసిఉన్నది. అక్కడ నాకొకపుస్తకం దొరికింది. ఆ పుస్తకంలో ఈ బంగాళాను గూర్చిన వివరాలున్నాయి. అందులో చునారగఢపు ఇంద్రజాలాన్ని భేదించటానికి ఏమి చెయ్యాలో కూడా ఉన్నది. ఆ పుస్తకాన్ని చునారగఢపు ఇంద్రజాలంయొక్క తాళం చెవి అనవచ్చు. ఇప్పుడా పుస్తకం లేదు. చదివిన తరువాత దానిని ఇంద్రజాలాన్ని భేదించటంలోనే అంతం చెయ్యవలసి వచ్చింది.

బ్రహ్మాండంలో చూడటానికి చాలా చిత్రాలున్నాయి. మీరక్కడ విహారం చేస్తూఉంటే చాలా ఆనందిస్తారుకూడా.

సురేం :- మంచి తప్పకుండా బ్రహ్మాండలాన్ని చూద్దాం. సరేకాని, యీ మూసి ఉన్న వాకిలి ఏమిటిమార్గం?

ఇంద్ర:- ఇదే చమత్కారగర్భపు ఇంద్రజాలానికి వెళ్ళే మార్గం. ఇప్పుడే వాకిలి తెఱచి మనం వెళ్ళాలి.

సురేం:- అలాగా ఐతే తెఱువు!

ఇంద్రజీతసింహుడు ఆ వాకిలిని తెఱవటానికి సంసిద్ధుడయ్యాడు. ఆ వాకిలి పైకమ్మిమీద మూడు నెమళ్ళు నిరంతరంగా కదులుతూ ఉన్నాయి. యువరాజు ఆ మూడు నెమళ్ళ మెడలూ ఒకచోటచేర్చాడు. ఆ వెంటనే వాకిళ్ళు తెరుచుకున్నాయి. అందరూ లోపల ప్రవేశించారు. లోపలికి వెళ్ళిన తరువాత మహారాజు "ఇదెట్లా మూసుకోటుందని" అడిగాడు. దానికి సమాధానంగా ఇంద్రజీతుడు "ఆసంగతి నాకు తెలియదు. కాని కొంతసేపటికి అది స్వయంగానే మూసికొని పోతుంది. లోపలవైపుకూడా అలాగే నెమళ్ళున్నాయి. వాటి సహాయంతో ఇటునుంచికూడా తలుపు తెఱవవచ్చు"అన్నాడు. మెఱుపుకత్తి వెలుగు అవసరం లేకుండానే గవాక్షాలనుండి, అప్పటికి వెలుతురు వస్తోంది. దూరంగా బహిరంగ ప్రదేశం కన్పిస్తోంది. అందరూ ముందుకు నడుస్తున్నారు. కొద్దిదూరం వెళ్ళిన తరువాత వారికి వాకిళ్ళులేని మార్గం కనిపించింది. అది దాటగానే అందరూ ఒక పాలరాతి చావడిలో చేరారు. దాని ముందు ఒక తోట ఉన్నది. ఆ తోటలో నాలుగు రకాల చావడులున్నాయి. తోటలో అక్కడక్కడ వేదికలున్నాయి.

పర్వతంమీదనుండి జాలువారే నీటితో తోటంతా చిన్న చిన్న కాలువలతో నిండియున్నది. దానిచుట్టూ ఎత్తైన పర్వతాలున్నాయి. దానివల్ల ఆ తోట ఒక లోయలో ఉన్నది. దానిలోనుండీ పర్వతాలను దాటి యెవరూ బయటకు పోలేరు. బయటివారెవరూ లోనికి రాలేరు.

ఇంద్ర: ఆ వేదికయొక్క యింద్రజాలం రెండుభాగాలుగా ఉంటుంది. ఒకటి యీతోట. మరొకటి ఆ వేదికను సమీపిస్తే కన్పిస్తుంది. ఈ తోటలో కన్పిస్తున్న ప్రతి వేదికలోపలా అగణితమైన ధనరాసులు కుప్పలు పోసివున్నాయి. మా సోదరులిద్దరం ఇక్కడికి వచ్చినప్పుడు ఈ వేదికలను సమీపించటానికిగాని ముట్టుకోటానికిగాని వీలులేకుండా ఉండేది. చూచారా! వేదికప్రక్కగా ఒక గొళ్ళెం ఉన్నది. దానికి తగిలించిఉన్న గొలుసు ఒకప్రక్క బావిలోకి పడిఉన్నది. ఈవిధంగా ప్రతి వేదిక గొలుసూ తక్కిన గొలుసులతో ఆ బావిలో కలుసుకొంటుంది. ఆ బావిలో ఏమున్నదో నాకు తెలియదు. కాని యీ వేదికలనుమాత్రం ఎవరూ ముట్టుకోలేరు. అంతేగాక చునారగఢపు ఇంద్రజాలంలోని వేదికమీదశయనించిఉన్న మనుష్యవిగ్రహందగ్గరనుంచీకూడా ఒక గొలుసు భూమిలోపలనుంచీ వచ్చి యీ బావిలో కలిసిఉన్నది. ఇక్కడ అన్ని గొలుసులూ కలుస్తున్నాయి. ఇంతే యిక్కడి యింద్రజాలవిశేషాలు. ఈ విషయం మాకు ఇంద్రజాల గ్రంథంవల్ల తెలిసింది. అందుకే మేము ఈ వేదికలకు దూరంగాఉన్నాము. ఆ తరువాత మేము ఈ తోటలోని కాలువనుండి ప్రవహించే నీటిని మేముక్రొత్తగా త్రవ్విన కాలువద్వారా ఈ బావిలోపడేటట్లు చేశాము. బావి

నిండుతున్నకొద్దీ ఈ వేదికలయొక్క ఐంద్రజాలశక్తి నశిస్తూ వచ్చింది. అప్పుడు మేము నుంచుకోగలిగాము. మా సోదరులిద్దరమూ గొలుసులను మొరవ్రకత్తితో నరికివేశాము. దానితో వేదికలకూ చునారగఢపు ఇంద్రజాలవేదికకూ సంబంధాలు తెగిపోయాయి. అప్పుడు మేము వేదికలను తెరచిచూస్తే అందులో ధనరాసులున్నాయి. మీరిప్పుడు అనుమతిస్తే మన ఐంద్రజాలికులు ఆ ధనరాసులను ఎక్కడికి చేరవెయ్యండంటే అక్కడికి చేరవేస్తారు.

ఇంద్రజీతుడు మహారాజు ఆజ్ఞానుసారం ఆ వేదికలన్నింటినీ పెట్టెలు తెరిపించి తెరిపించి చూపించాడు. వాటిలో కల నానావిధ మూల్యవస్తువులను చూచి మహారాజూ తక్కినవారుకూడా విభ్రాంతులైపోయారు. వాటిలో రెండు వస్తువులు మహారాజుకు చాలా బాగా నచ్చాయి. అందులో ఒకటి రత్నఖచిత సింహాసనం. అది దేదీప్యమానంగా ప్రభాసిస్తోంది. వేరొకటి ఒక విశిష్ట ధాతువుతో నిర్మితమైన చంద్రబింబం. ఆ చంద్రబింబానికి రెండు తలుపులున్నాయి. ఆ రెంటినీ ఏకం చేసినప్పుడు నిజంగానే అది చంద్రునివలె ప్రకాశిస్తూ చాలా దూరంవరకూ చల్లనివెలుగు ప్రసరింపజేస్తుంది. ఆ వస్తువులను చూస్తూనే ఆ రోజంతా గడిచారు. ఇంద్రజీతసింహుడు ఆ రాత్రికి అక్కడే గడుపుతామన్నాడు. కొంతమంది భోజనం సంగతేమిటని అడిగారు. ఇంద్రజీతుడు నవ్వుతూ "ఈ రాత్రికి సలిలభక్షణంబె సమ్మతంబు" అని మనం చునారగఢం చేరితేగాని ఆహార వస్తువేమీ దొరకదన్నాడు. ఇంద్రజాలికుల సంచులలో, ఏవో కొద్దికొద్దిగా తినుబండారా

లున్నాయి. అందరూ ఆ రాత్రి ఆ తినుబండారాలతో సరి పెట్టుకొని అక్కడ విశ్రమించారు.

# 10

రాజపరివారం విశ్రమించినచోటు చాలా అందమైంది. అదొక వసారా. మూడువైపుల గోడలు, తోటదిక్కు వద మూడు స్తంభాలు ఉన్నాయి. పై కెక్కడానికికూడా మెట్లు న్నాయి. పైన కొంత కప్పుండి తోటవైపుమాత్రం శూన్యంగా ఉన్నది. ఆ కప్పువేసిన భాగంలో మూడువైపులాగల గోడ లకు చాలా అలమరలున్నాయి.

ఒక జాము ప్రొద్దుపోయింది. అందరూ నిదురలో ఉన్నారు. ఒక అలమరపైన కమ్మిమీద దేవీసింహుడు క్రొవ్వు వత్తి వెలిగించి పెట్టాడు. కొంచెసేపాగిన తరువాత అందరూ మెలకువవచ్చి కూర్చొని మాట్లాడుకొంటున్నారు. సురేంద్ర సింహ మహారాజు నల్లగా కన్పిస్తున్న పర్వతాగ్రాన్ని చూస్తు న్నాడు. అతనికి అక్కడ ఒక కాగడా వెలుతురు కన్పించింది. అతడాశ్చర్యపడి అందరికి ఆ వెలుతురు చూపించాడు. ఇంద్ర జీతానందసింహులు ఇద్దరూ "ఏమిటా యిది" అని చూస్తు న్నారు. ఈ యింద్రజాలంలోకి వాళ్ళిద్దరూతప్ప ఇతరులెవ్వరూ రాలేరన్న సంగతి వాళ్ళకు తెలుసు. నలుగురైదుగురు మను ష్యులు దూరానగల ఆ వెలుతురులో కన్పిస్తున్నారు. ఐతే వాళ్ళు స్త్రీలో పురుషులో తెలియదు. ఉన్నట్టుండి ఆ వెలు తురు మాయమైంది. మనుష్యులెవరూ కన్పించటంలేదు.

మళ్ళా కొంతసేపటికి వెలుతురు వచ్చింది. ఈసారి సమీపాన గల ఆ వెలుతురులో మనుష్యులు బాగా కన్పిస్తున్నారు. గోపాలసింహుడు "ఇంద్రజీతసింహా! మీ రిద్దరూ తప్ప ఇతరు లెవరూ యిక్కడికి రాలేరుకదా!" అన్నాడు.

ఇంద్ర :- అప్రమేయగారి వంటివారైతే రాగలరుగా? మీరే యింద్రజాలానికి రాజులుగదా?

గోపా :- రాగలరనుకో. కాని వస్తున్న వాళ్ళు పర్వతంమీదనుంచి వస్తున్నారే. త్రోవకూడా లేదు

ఇంద్ర :- అవును! బహుశః వాళ్ళు ఈ తోటలోకే రావాలనుకొంటున్నారు. కొద్దిసేపట్లో వచ్చేస్తారుకూడా.

అప్పుడు వెలుతురు తిరిగి మాయమైంది. అందరూ అటువైపు చూడటం ప్రారంభించారు. ఆ తరువాత కొంతసేపటికి తోటయొక్క పడమటి దిక్కు వసారాలో వెలుతురు కన్పించింది. ఐతే వాళ్ళు ఆ వసారాలో ఏంచేస్తున్నారో కన్పించటంలేదు. సురేంద్రసింహ మహారాజు తేజసింహుణ్ణి సంగతి సందర్భాలు తెలుసుకొని రమ్మన్నాడు.

గోపా :- తేజసింహుడు అక్కడికి వెళ్ళటం మంచిది కాదు. ఇది ఇంద్రజాలం. ఏమి ఆపదవస్తుందో! నేనూ ఇంద్రజీతుడు వెడతాం.

మహారాజు సరేనన్నాడు.

గోపాలసింహుడూ ఇంద్రజీతసింహుడూ అటువైపు వెళ్ళారు. అక్కడ ఒక చెట్టుచాటున నిలబడి చూడసాగారు. వారికి పదిహేనుమంది మనుష్యులు కన్పించారు. అందరూ ముసుగులలో ఉన్నారు. ఇద్దరు కాగడాలు పుచ్చుకొన్నారు.

కాగడాలు చాలా విలువైనవి. వాటిలో నూనెపోసే ఏర్పాట్లు లేవు మరి ఆ కాగడాలు ఎట్లా వెలుగుతున్నాయో ?

ఆ మనుష్యులందరూ వసారాలను అలంకరిస్తున్నారు. వారిలో ఒకడు పనిచేయకుండా కుర్చీలో కూర్చొని పని చేయిస్తున్నాడు. అతనిచేతిలో మంచి కొరడావున్నది. ఆ కొరడా పిడి చాలా అందంగా వున్నది. కొంతసేపట్లో వసారా అలంకరించి దీపాలు వెలిగించారు. అప్పుడా కుర్చీలోనున్న వ్యక్తి తనతోడివారితో ఏదో చెప్పి మేడమీదనుంచీ క్రిందకు దిగి సురేంద్రసింహుడున్న వైపుగా వెళ్ళిపోయాడు. ఆ వెంటనే గోపాలసింహుడూ ఇంద్రజిత్తునూ సురేంద్రసింహ మహారాజు వద్దకు వెళ్ళిపోయి తాము చూచిన సంగతి అంతా చెప్పారు. అప్పటి కక్కడికొక మనుష్యుడు రావటం కన్పించింది. దగ్గరకు వచ్చినకొద్దీ పరికించగా అతడు ఇంద్రదేవుడని స్పష్టమవుతున్నది. కాని అతడు గోపాలసింహుడూ ఇంద్రజిత్‌సింహుడూ చూస్తుండగా బయలుదేరిన వ్యక్తి కాదు. ఇంద్రదేవుడు రాజ పరివారంలోనికి వచ్చి అందరికీ నమస్కరించాడు.

సురేం:- ఇంద్రదేవా ! ఈ యింద్రజాలానికి నీవు సర్వాధికారివని యింద్రజిత్తునివల్ల తెలుసుకొని చాలా సంతసించాను. కాని యీ విషయం యింతకుముందు నీవు నాకెప్పుడూ చెప్పలేదు. ఈ సమయంలో నిన్నిక్కడ చూడటంచేత చాలా సంతోషమయింది. ఐతే నీవు మాతోపాటు ఎందుకు రాలేదో చెప్పు.?

ఇంద్రదేవుడు:-( కూర్చొని) మహారాజు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. నా కెన్నో పనులుండి యిలా ఒంటరిగా

కావలసి వచ్చింది. ఈ యింద్రజాలానికి నేను ప్రధాన సంరక్షకుణ్ణి. మీవంటి మహాపురుషులచేతిలో యీ యింద్రజాలాన్ని అప్పగిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వున్నది. మహా బలపరాక్రమశాలురైన మీమనుమలు యీ యింద్రజాలాన్ని ఛేదించారు. ఈ ఇంద్రజాలంయొక్క గొప్పతనాన్ని మీకు నేను తెలియజేస్తాను. ఆపని నావల్లనే అవుతుంది మీమనుమ లిద్దరూ వారికి తెలియవలసినదంతా తెలుసుకున్నారు. కాని, నా చేతిలోవున్నదాన్ని వారూ తెలుసుకోలేదు. ఇంద్రజాలాన్ని నిర్మించినవాళ్ళు రెండు పుస్తకాలను వ్రాశారు. ఒకటి దీని సంరక్షకులకిచ్చారు. రెండవది యింద్రజాలాన్ని ఛేదించే వారికోసం దాచిపెట్టారు. అది యిప్పుడు యువరాజులకు దొరికింది. సంరక్షకులకు యిచ్చిన గ్రంథం పారంపర్యంగా వస్తూ నేటికి నా చేతికి లభించింది. ఈ యింద్రజాలంలో రాకుమారులు వెళ్ళలేని చోట్లున్నాయి. నేనూ ఆ చోట్లకు యింద్రజాలాన్ని ఛేదించకపూర్వం వెళ్ళలేను. ఇప్పుడు వెళ్ళగలను. అందుకే వచ్చాను. మహారాజు నేనీపని చెయ్యటానికి పూర్వం ఒకటి నాకివ్వాలి.

సురేం :- ఏమిటది?

ఇంద్ర :- ఈ యింద్రజాలంలో నేను మీతోఉన్నంత వరకూ సామాన్యమైన మర్యాద నియమాల విషయంలో క్షమించాలని కోరుతున్నాను.

సురేం :- ఇంద్రదేవా ! ఒక్క యీ యింద్రజాలంలోనే కాదు. ఎల్లప్పటికీ నిన్నా విషయాలలో క్షమిస్తున్నాను. మా వాళ్ళంతాకూడా నిన్నలాగే చూస్తారు.

ఇంద్ర :- మహా ప్రసాదం. మీ కిప్పుడు భోజనాల యేర్పాట్లు చేస్తాను.

సురేం :- అల్లాగే చెయ్యి.

తేజ :- ఐతే నిన్ను నిజంగానే ఇంద్రదేవుడవని నమ్మమంటావా?

ఇంద్ర :- నేను తప్ప ఇంకెవ్వరూ ఇక్కడికి రాలేరు కదా?

తేజ :- అయినా 'చిలియండోలా'.

ఇంద్ర :- 'చక్రిధర్'.

వీరేం :- నిన్నొకటి అడుగుతాను.

ఇంద్ర :- చిత్తం.

వీరేం :- నీ వుండే చోటు ఎటువంటిది?

ఇంద్ర :- ఏ చోటు?

వీరేం :- మాయరాణి సాధువును నీ దగ్గరికి తీసుకొని వచ్చిన చోటు.

ఇంద్ర :- ఆస్థానం ఈ యింద్రజాలంలోనిదే. మిమ్మల్ని అక్కడికి తీసుకొని వెళ్లుతాను. మొదట మీరు భోజనం చెయ్యండి.

తేజ :- కాగడాలు పుచ్చుకొని వచ్చింది మీరేనా?

ఇంద్ర :- అవును. మీరు ఆశ్చర్యపడి ఉండవచ్చు. నాతోపాటు ఎన్నో వింతలనుకూడా కొని వచ్చాను.

ఇలా అని ఇంద్రదేవు డక్కడనుంచి వెళ్ళిపోయాడు.

# 11

ఇంద్రదేవుడు తిరిగి కొంతసేపటికి వచ్చాడు. ఈసారి అతనివెంట చాలామంది ముసుగుమనుష్యు లున్నారు. వాళ్ళ చేతులలో రకరకాల తినుబండారాలున్నాయి. ఒకడు నేలపై నీరుచల్లి బాగుచేసి భోజనాలను వడ్డించాడు. ఇంద్రదేవుడు రాజపరివారాన్ని భోజనాలు చేయించాడు. అందరూ మేడపైకి వెళ్ళి కూర్చున్నారు. ఆ భవనం సర్వాలంకార శోభితమై ఎంతో అందంగా ఉన్నది. ఒక్కొక్కరూ విశ్రాంతి తీసుకోటానికి వేరువేరుగా ఏర్పాట్లు జరిగాయి. మహారాజు ఆ యేర్పాట్లుచూచి ఇంద్రదేవునితో "ఈ సామానులన్నీ యీ తోటలోవేనా?" అన్నాడు.

ఇంద్రదే:- అవునండీ! ఈ తోటలో ఉన్న ప్రతి భవనాన్నీ అలంకరించటానికి కావలసిన పరికరాలన్నీ యిక్కడ సమృద్ధిగా ఉన్నాయి. అందులో నాయిల్లు దగ్గరకూడా అవటం వల్ల తక్కువయిన వస్తువులను ఇంటిదగ్గరనుంచే తెప్పిస్తాను. అది సరేకాని మీకు నేనొక విషయం చెప్పదలిచాను.

మహారాజు:- ఏమిటది?

ఇంద్రదే:- ఈ యింద్రజాలాన్ని మా పూర్వులు నిర్మించారు. వారి ఆజ్ఞానుసారం దీని రక్షణభారంకూడా మా వంశం వారిమీద పడింది. నా తరం వచ్చేసరికి దాని భవిష్యత్తు మార్పు చెందింది. మీ పౌత్రులు దీనిని భేదించి యిందులో గల గుప్త ధనానికి సర్వం సహాధికారులైనప్పటికీ ఇంకా వారికి తెలియని ధనం ఎంతో ఉన్నది. అంతేగాక నేటికీ ఈ యింద్ర

జాలం యథేచ్ఛగా అందరూ ప్రవేశించటానికి వీలుగా చెయ్యటం జరుగలేదు. మీరు అనుమతించినట్లయితే చిరంజీవులచేతనే మిగిలిన భాగాన్ని ఛేదించటం పూర్తి చేయిస్తాను. ఆ పని వాళ్లవల్లనే అవుతుంది. కాని పూర్వులు నిర్మించిన యీ అపూర్వ నిర్మాణాన్ని త్రుటిపాటులో నేలమట్టంగాకుండా ముందు తరాలవారికికూడా కొద్దిగా విడిచిపెట్టటం మంచిది. మీ ఆజ్ఞానుసారం ఇంద్రజాలమంతా మీకు చూపిస్తాను. పెద్దల నియమానుసారం ఈ దాసుడు సాధ్యమైనంత వరకూ ఈ యింద్రజాలాన్ని సంరక్షించటంలో శక్తివంచన లేని కృషి చేశాడు. ప్రభువులవారు ఇకనుంచీ దీని రక్షణ బాధ్యతను యితరు లెవ్వరికైనా అప్పగిస్తే మంచిది.

మహారాజు:- ఇంద్రదేవా! నాకు నిన్ను చూచినా నీ కర్తవ్య నిర్వహణ చూచినా ఎంతో ఆనందం కలుగుతోంది. అటువంటి నిన్ను ఈ యింద్రజాల రక్షణ బాధ్యతనుంచి తొలగించి వేరొకడిని నియమించటం అర్థంలేని పని. కాని నీవు చెప్పినట్లు దీనిలో కొంతభాగాన్ని ముందు తరాలవారికి విడిచి పెట్టటం మంచిదే. దానివల్ల మన పూర్వుల కీర్తి ప్రతిష్ఠలు మున్ముందుకు కొనసాగే అవకాశం ఉంటుంది.

ఇంద్రదే:- చిత్తం, తమకింకొక విషయం చెప్పాలనుకొంటున్నాను.

మహారాజు:- ఏమిటది?

ఇంద్రదే:- దయచేసి మీరు మొట్టమొదట నా నివాసాన్ని పవిత్రం చెయ్యండి. ఆ తరువాత ఈ యింద్రజాలాన్ని చూపించి మనారగఘానికి చేరుస్తాను. చిరంజీవులు ఇక్కడ

గడించిన ధనరాసులను ముందుగానే చునారగఢానికి పంపిం చటం మంచిది. ఏయే వస్తువులను మీరు చునారగఢానికి పంపిచాలనుకొంటున్నారో వాటి సంగతి నాకు చెప్పితే నేనా పని చేయిస్తాను. ఆ సామానులను అతి త్వరగా బయటికి చేర్పించడంలో నాకంటే ఎక్కువ తెలిసినవారెవరూ లేరు.

మహారాజు:- అలాగేచేద్దాం. ఆవస్తువులేమిటో మీకు ఇంద్రజీతుడు చెబుతాడు.

ఇంద్రజీతసింహుడు ఆ వస్తువుల వివరాలను ఇంద్రదేవుని కిచ్చాడు.

వీరేం:- ఇంద్రదేవా! నీవు నీవెంట చాలా వింతలు తెచ్చానన్నావే? వాటిసంగతేమైంది?

ఇంద్ర :- చిత్తం తెచ్చాను. వాటిసంగతి మా యింటికి వెళ్ళిన తర్వాత తెలియ జేస్తాను.

మహారాజు:- అలాగైతే యింటికి వెళదాం పద.

ఇంద్రదే:- ఇప్పుడు చాలాప్రొద్దుపోయింది. ప్రభువుల వారు ఇక్కడనే కొంతసేపు విశ్రమిస్తే తెల్లవారుజామున లేచి మాయింటికి వెళ్ళటం మంచిది. ఈలోగా మాయింటిదగ్గర చేయవలసిన ఏర్పాట్లు చేసుకోటానికి వీలుంటుంది.

ఇంద్రదేవుని అభిప్రాయంప్రకారం సురేంద్రసింహామహారాజు అందరినీ 'ఇక్కడే కొంతసేపు విశ్రమించండి!' అని ఆజ్ఞాంచాడు. ఇంద్రదేవుడు సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. అతి

త్వరగానే అందరూ నిద్రపోయారు గాని భూతనాథుడుమాత్రం ఏవేవో ఆలోచనలలో రాత్రిఅంతా మేలుకొని వున్నాడు.

ఇంకా ఒకగంటకు తెల్లవారుతుందనగా యింద్రదేవుడు వచ్చాడు. రాజపరివారం నిద్రిస్తున్న ప్రదేశానికి ముందు భాగంలో బహిరంగస్థల మున్నది. ఆ ఆరుబయట రెండు ప్రక్కలా రెండు సింహాసనాలు అతి విశాలమైనవి ఉన్నాయి. యింద్రదేవుడు కుడివైపునగల సింహాసనంమీదకూర్చున్నాడు. అతడు కూర్చోవటంతోనే ఆ సింహాసనంలోనుండి సుమధుర సంగీతం తీగలువారుతూ ప్రారంభమై చివరకు వివిధ వాద్య సమ్మేళనతో యిక కలకంఠకంఠిగా నాలాపనచెయ్యటం ప్రారంభ మైంది. ఆ సంగీతానికి అందరూ మేలుకొన్నారు. వారికి ఆశ్చర్యం కలిగింది. సురేంద్రసింహుడు 'ఈ సంగీతం ఎక్కడి నుంచి వస్తుందో!' అని బయటికివచ్చి చూచాడు. ఇంద్రదేవుడు అతనికి ఎదురువెళ్ళి నమస్కరించాడు. అతనిని మహారాజు "ఈ సంగీతం ఎక్కడినుంచి వస్తోంది?" అని ప్రశ్నించాడు. యింద్ర దేవుడు మహారాజును ఆ సింహాసనందగ్గరికి తీసుకొనిపోయి దానిలోని రహస్యాలను విప్పిచెప్పి "మిమ్మల్ని మేల్కొల్ప టానికే నే నీ పని చేశా"నని చెప్పాడు. ఆతర్వాత యింద్ర దేవుడు సమస్తరాజపరివారాన్నీ తనవెంట తీసుకొని నిజ గృహం వైపుగా మరలాడు.

ఆ భవనానికి ప్రక్కగా ఒక గదివుంది. దానిలోనుండి అందరినీ యింద్రదేవుడు తీసుకువెళ్ళాడు. అతని చేతిలో మెరపు కత్తి వున్నది. దాని వెలుతురు సహాయంతో అందరూ ఒక చీకటిగదిలో ప్రవేశించారు. అక్కడ ఎత్తైన సామాధి ఒకటి

ఉన్నది. అది ఒక సొరంగపు మార్గానికి ముఖద్వారం. దానిని ఇంద్రదేవుడు తెరిచాడు. అందులోనుండి అందరూ దిగి సొరంగంలోనికి నడకసాగించారు. అదిఒక పర్వతాన్ని తొలచిన మార్గం వాళ్ళు ఆ దారిని పైకి ఎక్కుతున్నారు. కొద్దిదూరం నడిచిన పిమ్మట ఇంద్రదేవుడు అందరినీ ఆగమన్నాడు. అక్కడ ఎదురుగా ఒక వాకిలి మూసివున్నది. తాళంచెవితో దాని నతడు తెరచాడు. అందరూ ఒక అందమైన గదిలో ప్రవేశించారు. ఆ గది దాటిన తర్వాత వారికప్పుడు తెల్లవారినసంగతి తెలిసింది.

మాయారాణి వృద్ధసాధువు తారా కలిసి తన్ను సంరక్షించవలసిందని ప్రార్థిస్తూ యింద్రదేవుని వద్దకు వచ్చిన ప్రదేశం అదే. ఇంద్రదేవుడు రాజపరివారాన్ని తోటలోనికి తీసుకువెళ్ళాడు. ఆ ప్రాతఃకాలవేళ ఉద్యానవనం శోభను అందరూ తన్మయులై చూడసాగారు. రాజపరివారానికి ఆ చోటు చాలా ఆనందాన్ని కలిగించింది. అందరికి ఉచితాసనాలున్నాయి. కాని ఎవరూ కూర్చోలేదు. తోటలో విహరిస్తున్నారు. ఆ సమయంలో ఒక వ్యక్తి వెండి కడవతో నీళ్ళు ముంచుకుని బంగారు కూజాను చేతపట్టుకుని రావటం కనిపించింది. ఆ వ్యక్తిని చూచి భూతనాథుడూ, దేవీసింహుడూ, అదరిపడ్డారు. ఆ వ్యక్తి కడవనూ కూజానూ ఒక అరుగుమీద పెట్టి వెళ్ళిపోయాడు. ఆవ్యక్తిని ముసుగు మనుష్యుల యింట్లో లోగడ భూతనాథుడూ దేవీసింహుడూ చూచారు. అతడే ఒక చిత్రాన్ని ముసుగుమనుష్యుల యెదుట చూపించి, "అయ్యో! దీనిని ఆధారంగా తీసుకొనే భూతనాథునిమీద

దోషారోపణ చేస్తాను' అన్నాడు. ఆ సమయంలోనే భూత నాథుడు ఆ తోటలో తన భార్య పూలు కోస్తూవుండటం చూశాడు.

# 12

అంతవరకూ అతి ప్రశాంతంగా వున్న భూతనాథుడు తిరిగి దోళాందోళిత మనస్కుడయ్యాడు. తన భార్య ఆతోటలో పనిచేస్తూ ఉండటం చూచి మరి సహించలేకపోయాడు. కడవనూ కూజాను అక్కడపెట్టి వెళ్ళిపోతున్న వ్యక్తితో ఇంద్రదేవుడు "అర్జునా! కొంచెం ఆ పటాన్నికూడా తీసుకొనిరా. భూతనాథునికి దానిని చూపించి ఎన్నాళ్ళనుంచో బెదిరిస్తానంటూ కూర్చున్నావు." అన్నాడు. ఆ వ్యక్తిపేరు విని భూతనాథుడు మరీ వణకాడు. నిజానికి అతనిపేరు అదే.

ఆసమయంలో అందరూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. అందుచేత ఒకరికి మరొకరు సంబంధంలేకుండా దూర దూరంగా ఉన్నారు. భూతనాథుడు దేవిసింహాన్ని సమీపించి "చూచావా యింద్రదేవుని వ్యవహారం?" అన్నాడు.

దేవీ సిం :- అన్నీ చూస్తున్నా. నీవేం! భయపడబోకు.

భూత :- ఇంద్రదేవునికి యింకా నామీద అనుమాన మున్నదనుకొంటాను.

దేవి :- ఇంద్రదేవునిమీద నాకాలాటి అనుమాన మేమీలేదు. ఐనా ఎందుకు నీవంత భయపడతావు? ముసుగు మనుష్యులను వెంబడించి అన్నిసంగతులూ తెలుసుకొన్నావు.

చివరకు ఆ ముసుగుమనుష్యులు మన రాకుమారులే అని తెలుసుకొన్నావు.

భూత :- అవుననుకో.

దేవి :- ఐతే యింకా ఎందుకయ్యా భయం ?

భూత :- నీవు చెప్పేది నిజమే. ఏంజరుగుతుందో చూద్దాం.

దేవి :- ఐనా నీ రహస్యాలు రాజకుమారుల కెట్లా తెలిసినవో కాస్త ప్రయత్నించు.

భూత :- సరే కాని, నా భార్యనుగురించి నీఅభిప్రాయ మేమిటి ?

దేవి :- నాయనా ! ఈ విషయంలో మన మిద్దరం ఒకే విధమైన పరిస్థితులలో ఉన్నాం. ప్రత్యేకించి నేనేమీ చెప్పలేను. అదిగో ! ఇంద్ర దేవుడు తేజసింహునివద్దకు వెళ్ళాడు. నీభార్య కేమిటో సంజ్ఞచేశాడు. తేజసింహుడు వెళ్ళిపోతే మన మాయనను కలుసుకొందాం, అరెరే ! నీకొడుకు నానక్ కూడా వస్తున్నాడే. అతని చేతిలో ఏదో పటం ఉన్నట్లుంది. అతని ప్రక్కనే అర్జునుడున్నాడు.

భూత :- ఔనయ్యా ! వీరిద్దరూ ఎప్పుడు కలుసుకొన్నారు ? నానక్ ఇక్కడికెందుకు వచ్చినట్లు? తల్లితో కలిసి వచ్చాడా? నామీదకూడా వీడికి శత్రుభావం ఉన్నది కాబోలు! అబ్బబ్బ. ఈ యింద్రజాలాల భూమి నాకు భయానకమై పోయింది. నిజమైన యింద్రజాలం అదే. అదంటే నాకుచాలా విశ్వాసం. అక్కడ నాకు గౌరవం జరుగుతుంది. అక్కడ

నేనితడిని శత్రువుగా భావించాను. అతడక్కడ నాతో మాట్లాడ టానికి కూడా ఇష్టపడేవాడుకాదు.

దూరాననుండే భూతనాధునికి నానక్ ప్రణామం చేశాడు. అర్జునునితో ఇంద్రదేవునివద్దకు వెళ్ళాడు. అతని దగ్గర తేజసింహుడున్నాడు. ఆ సమయంలో అర్జునుని చేతి లోనూ ఒక పటం ఉన్నది. ఇంద్రదేవుడు వారినిద్దరినీ దూరం గానే వుండమన్నాడు. తేజసింహునితో మాట్లాడటం ముగిసిన మీదట వారిని దగ్గరకు రండని పిలిచాడు. వారు దగ్గరకు వచ్చినతరువాత అతను ఏదో చెప్పి వెనుకకు పంపాడు. అక్కడ నుండే ఇంద్రదేవుడు తేజసింహుని వెంటబెట్టుకొని సురేంద్ర సింహామహారాజు వద్దకు వెళ్ళాడు. వీరేంద్రుడుకూడా అక్కడే ఉన్నాడు. అక్కడ మహారాజుతో ఇంద్రదేవుడేదో చెప్పాడు. ఆ తర్వాత నలుగురూ కలసి తోటలోనికి వెళ్ళారు. అందరూ మహారాజును సమీపించారు. దాదాపు అది ఒక చిన్న దర్బా రులా ఉన్నది.

వీరేం :- ఇంద్రదేవా! యింకా ఎప్పుడయ్యా తమా షాలు చూపించేది?

యింద్ర :- మీ ఆజ్ఞ ఎప్పుడైతే అప్పుడు.

వీరేం :- మేము సిద్ధమే.

శీత :- ఇంతకూ అది చూడటానికి ఎంతసేపుపడుతుంది? త్వరలోనే ముగిసేదైతే చూద్దాం.

యింద్ర :- అయ్యా! మీరన్నట్టిది తొందరగా పూర్తి అయే దేమీకాదు. అందుచేత భోజనాలయిన తర్వాత ఆ పని పెట్టుకోవటం మంచిది.

మహా :- సరే! భోజనాలు జరిగే యేర్పాటు చేయించండి!

ఇంద్రదేవుని ఏర్పాట్లు చాలా బ్రహ్మాండంగా ఉన్నాయి. ఎవరికీ ఏ విధమైన లోట్లూ లేకుండా సౌకర్యాలు చేశాడు. భోజనాలు పూర్తి అయినాయి. అందరూ ఒకగదిలో కూర్చున్నారు. అప్పుడు ఇంద్రదేవుడు "ఇక నా కార్యక్రమానికి అనుజ్ఞఇస్తారా?" అన్నాడు.

మహా :- ఊఁ! కానీ!

ఇంద్రదేవుడు గది బయటకు వెళ్ళాడు. కొంతసేపు గడచినతర్వాత తిరిగివచ్చి యథాస్థానంలో కూర్చున్నాడు. అప్పుడు నానక్ ప్రవేశించాడు. అతనిచేతిలో ఒక చిత్రపటం గుడ్డలు చుట్టిఉన్నది. అతడొక మూల కూర్చున్నాడు. అర్జునుడుకూడా వచ్చి అతనిప్రక్క కూర్చున్నాడు. ఆ తర్వాత కమలయొక్క సోదరుడూ భూతనాథుని కుమారుడూ అయిన హరనామసింహుడుకూడా వచ్చాడు. అతడూ మహారాజుకు నమస్కారంచేసి అర్జునునిప్రక్క కూర్చున్నాడు. అతనివద్ద ఒక చిన్నపెట్టె ఉన్నది. అటుపిమ్మట ముసుగులు వేసుకొన్న ముగ్గురుస్త్రీలు ప్రవేశించి మహారాజుకు ప్రణమిల్లి వేరొక వాకిలిగుండా గదిబయటికి వెళ్ళారు. ఈ వ్యవహారం అంతా

భూతనాథునికీ దేవసింహునికీ అత్యాశ్చర్యాన్ని కలిగించ సాగింది. వారికి ఆ మూడవ స్త్రీ ఎవరో తెలియలేదు. మహారాజు "ఆ మూడవస్త్రీ యెవరు?" అని ప్రశ్నించాడు.

ఇంద్ర:- ఆమె నిరుపేదరాలు. సత్యహిత. చాలాకాలం నుంచీ అనేకకష్టాలు సహించింది. ఆమె భూతనాథుని ప్రథమ పత్ని. కమలతల్లి.

భూతనాథుడు ఆసంగతివిని కెవ్వున కేకపెట్టాడు. స్పృహ తప్పిపోయేటంతపని అయింది. కానీ అతికష్టంమీద అతడు తన్నుతాను సంబాళించుకోగలిగాడు.

